# ప్రబోధచంద్రోదయము.

## ప్రథమాంకము.

మ. రవిరశ్మిన్ దినమధ్యమందు జలపూరంబుల్ బరెన్ దృష్టికిన్
భువి నజ్ఞానముచేత భాతి జగంబుల్ చేనఁ దోఁచుం దగన్
భుజగుండన్ ఫణి మన్న భ్రాంతివలెఁ బోవున్ దేనఁ బ్రాజ్ఞాళిక
య్యవి, యానిర్మలబోధుఁ డలఁతు సాంద్రానందమున్ మన్ననిన్,
నిందుమనంబు శాంతిఁ గనఁ జేర్చినయప్పుడు బ్రహ్మరంధ్రమం
దుండి సుషుమ్నరుద్ధపవనోద్గతమై సుఖసాంద్రమౌ దు ను
ద్దండలలాట నేత్రమిషఁ దాఁ బ్రకటీకృతమైనయట్లు బ్ర
హ్మాండమునిండు నీశ్వరు చిదాత్మకతేజము మిమ్ము బ్రోచుతన్.

(నాంద్యంతమున.)

సూత్ర. తథాస్తు—అతివిస్తారమేల? చాలును, సకలసామంతచక్రచూడామణిమరీచిమంజరీనీరాజితచరణరాజీవుండును, బలవదహితనివహవక్షస్తటకవాటపాటనప్రకటితనరసింహరూపుండును, బహుబలతరశరపతితకులప్రళయమహార్ణవమగ్నమేదినీసముద్ధరణమహావరాహుండును, నిఖిలదిగ్విలాసినీకర్ణపూరీకృతకీర్తిలతాపల్లవుండును, సమస్తాశాస్త్రాంభేరమకర్ణతాలాస్ఫాలనబహుళశీతరపవనసంపాతనర్తితప్రతాపానలుండును, నగు గోపాలుండు—సమాజసుహృత్తు లైన శ్రీకీర్తివర్మమహారాజులవారి దిగ్విజయవ్యాపారముచేత బ్రహ్మానందరసానుభవమునకు ఎడములేక మేము వివిధవిషయములం దగిలి వ్యర్థముగా దినములు గడపినారము. అయినను మేమిప్పుడు కృతకృత్యులమైనారము.

గీ. జయమునొందిరి ధర్మవిభుశత్రునృపులు;
మహి సురక్షితయయ్యె సన్మంత్రిగరిమ;
రాజమకుటార్చితాచ్ఛసామ్రాజ్యలక్ష్మి
యబ్ధిమేఖలయగుక్షితి నలినిఁజేరె.

అందుచేత మేము శాంతరసప్రధానమయిన పరియోగాభినయముచేత మనస్సును వినోదపెట్టఁగోరుచున్నాము. కాఁబట్టి యింతకుఁబూర్వము ఘనాఢ్యులయిన కృష్ణమిశ్రులవారు రచియించి మాకు సమర్పించిన ప్రబోధచంద్రోదయమను నాటకమును మీరిప్పుడు ప్ర

కీర్తివర్మమహారాజులవారి సన్నిధానమందుఁ బ్రయోగింపవలెను. రాజుగారికిని సభవారితోఁగలిసి దానిని జూడవలెనని వేడుకగలదు.''—అని నాతో సెలవిచ్చెను. అవుఁగాక! నేనింటికిఁబోయి నాగృహిణిని బిలుచుకొనివచ్చి సంగీతకర్మమున కుపక్రమించెదను. (అని కొంచెముతిరిగి తెరవంకఁజూచి) ఓసీ! ఇటురమ్మ.

నటి—(ప్రవేశించి) ఇదిగో వచ్చినదానను. నే నేనియోగము ననుష్ఠింపవలెనో దేవరవారు సెలవియ్యవలెను.

సూత్ర—ఓసీ! నీవును దెలిసియేయున్నది!

మ. కలఁచుద్యత్ప్రిపుభూపభూరిపృతనాకాంతారముల్ గ్రొత్త
పలపత్సాధకకేళికాక్రమితవిశ్వవారితుఁ డాశాంతని
శ్చలవిశ్రాంతయశంబు ఖడ్గలతికాసంభిన్నకంఠారిరా
ట్కులలభ్యాస్థాపిత కీర్తివర్ముఁడు తగన్ గోపాలుఁ డుర్వీస్థలిన్.

మఱియును,

మ. రణరంగస్థలి విష్ణుఁడున్ మనుజభూగ్రామాశరాస్ఫాలనో
ల్బణవల్గన్నృకపాలతాళరవముల్వ్యాపింప, ఝుంఝానిలా
రణసంక్షోభితకుంభికుంభకుహరప్రవ్యక్తనాదంబులన్
బ్రణుతింపుం దదపూర్వకీర్తుల, నటింపంగాఁ బిశాచాంగనల్.

అతఁడిప్పుడు శాంతపదస్థితుఁడయి యాత్మవినోదార్థముగాఁ బ్రబోధచంద్రోదయనాటకమాడవలెనని యాజ్ఞాపించియున్నాఁడు. నటులు నిప్పుడు వేసములుధరించి వచ్చునట్లు నియమింపవలెను.

నటి—(విస్మయముతో) ఆర్యపుత్రా! ఆశ్చర్యము! ఆశ్చర్యము! ఇట్లునిజభుజబలవిక్రమైకనిర్భర్త్సితసకలరాజమండలుండైనయాతం డాకర్ణాకృష్టకఠినకోదండదండబహుళశరవర్షపరనికరజర్జరీకృతతురంగతరంగసందోహంబును నిరంతరనిపతత్తీక్ష్ణశస్త్రప్రసారితసర్వస్తోత్తుంగమాతంగమహామహీధరసహస్రంబును భ్రమద్భుజదండచండమందరాభిఘాతఘూర్ణితసకలపదాతిసలిలసంఘాతంబును నగుకర్ణసైన్యసాగరంబును మథియించి క్షీరపారావారంబునుంబోలె నిర్మథించి సమరవిజయలక్ష్మిం జేకొని వీరచరితుఁడై యిప్పు డిటువంటిసకలజననిజనశ్లాఘనీయమైన యుపశమ మెట్లుపొందెను?

సూత్ర—ఓసీ! బ్రహ్మజ్యోతి యెప్పుడును స్వభావముచేత సౌమ్యమయినదే. అయినను, అదియేదోకారణముచేత వికారమును బొందినను మరల స్వభావమునందే నిలుచును. ఆప్రకారముగా నే సకలభూపాలకులప్రళయకాలాగ్ని యుగ్రుఁడైన చేదిపతిచేత నున్మూలింపఁబడిన చంద్రాన్వయపార్థివపృథివీరాజ్యమును స్థిరీకరించుటకయి యీయుద్యోగసంరంభము కలిగినది. చూడుము—

గీ. ప్రళయకాల సముద్ధూతవాయువశతఁ
బర్వతంబుల లంఘించు వారిరాశి
నిశ్చలంబయి స్వచ్ఛమై నిలువలేదె
యిపుడు మేరమీరక స్వభావస్థగరిమ?

అంతేకాక శ్రీమన్నారాయణాంశసంభూతులయిన యిటువంటి పౌరుషభూషణులగు పురుషులు భూతహితముకొరకు భూమియందవతరించి విహితకృత్యములను నిర్వహించి మరలశాంతినిఁ బొందుదురు. ఇప్పుడు పరశురాముని కథవినుము.—

మహాస్రగ్ధర.

ఎవఁడీ ధాత్రీస్థలిన్ మున్ నృపులఁగడసి మర్త్యోదయామూలుల్ ద్విషన్మాం
సవసామస్త్రిక్ష పంకాచ్ఛరుధిరనదులన్ స్నానముంజేసెఁ; జేదో
యి వధించె నిర్దయుండై యొకఁడు వనితలన్ వృద్ధులన్ బాలురన్ మా
నవపాలాంచద్భుజాఖండనదళనసందీప్తకుఠారాగ్రధారన్.

గీ. అట్టి జామదగ్న్యుఁడు స్వవీర్యమున భూమి
భారముసడించి, నృపకులాన్వయముఁ ద్రుంచి,
కోపపావకు నాపయియోపడంచి!
తపముబలిమిని బరమశాంతతవహించె.

ఆలాగున నే యితండును గర్తవ్యమును నెఱపి యిప్పుడు పరమోపశమనిష్ఠుఁడయి యున్నవాఁడు.

గీ. పుడమిపైని వివేకుండు మోహజయముఁ
బడయునట్లుగఁ గర్ణుని వడిజయించి
యా ప్రబోధునకుంబలె నభ్యుదయము
నితఁడు శ్రీకీర్తివర్మభూపతికి నొసఁగె.

[తెరలో]

ఓరీ! పాపీ! నటాధమా! ఏమీ? నాదేహములోఁ బ్రాణములుండఁగానే మాస్వామి యయిన మహామోహునకు వివేకునివలనఁ బరాజయము నుదాహరించుచున్నావు!

సూత్ర—(తొట్రుపాటుతోఁజూచి) ఓసీ! చూడు,

చ. మదనుఁడు నచ్చెనిచ్చటికి మంజులపీనకుచద్వయంబు పై
రెద ఘటియింపుచున్ రతిరహిన్ బులకాంచితబాహువల్లులన్
గదిసి కవుంగిటంబొదువఁగా, మదఘూర్ణితనేత్రపద్ముఁడై
యదె నయనాభిరామసుభగాకృతి లోకము మోహపెట్టుచున్.

అతఁడు నామాటలవలనఁబుట్టిన క్రోధము మూర్తీభవించివచ్చినట్లు కనఁబడుచున్నాఁడు. ఇక్కడనుండి మనమతనిని విడిచి పాఱిపోవుటయే శ్రేయము.

(ఇద్దఱును నిష్క్రమించుచున్నారు.)

ఇది ప్రస్తావన

—:o:—

[వెనుకఁ జెప్పినరీతిని కాముఁడును, రతీదేవియుఁ బ్రవేశించుచున్నారు.]

కాము—(కోపముతో) ఓసీ! పాపీ! నటాధమా! ఏమీ! నాబొందిలోఁ బ్రాణములుండఁగానే మాస్వామియైన మహామోహునకు వివేకునివలనఁ బరాజయము నుదాహరించుచున్నావు! ఔరా! భరతాధమా!

గీ. పృథివి నిందీవరాక్షుల దృష్టివిశిఖ
సంతతులు పర్వుచుండెడు నంతవఱకు
మహితవిద్వాంసులకునైన మనసులందు
శాస్త్రజన్యవివేకంబు సంభవిల్లు.

ఉ. సుందరమందిరంబులును, సోయగపుం జవరాండ్రు, షట్పదా
మందరవోల్లసల్లతలు, మల్లెలతావుల నొప్పుగాడ్పులున్,
జందురుఁడున్న రేలు, నెటనాకు నమోఘబలంబుకోట గ
ల్గొందఁగ, నవ్వివేకుఁ డెటులుండుఁ? బ్రబోధుఁడు నెట్లు పుట్టెడున్?

రతి—ఓప్రాణేశ్వరా! మహామోహ మహారాజుగారి శత్రువయిన వివేకుఁడు సామాన్యుఁడుకాఁడని తలఁచుచున్నాను.

కాము—ఓప్రియురాలా! స్త్రీస్వభావముచేత వచ్చిన పిరికితనముబయలఁ బడునట్లుగా, నీవావివేకునకు కేలభయపడెదవు? చూడుము.

క. శరములు విల్లును నాకో
సరసిజముఖి! పూలెయైన, క్షణమున సురరా
సురమగ సర్వజగంబును
దెరలక నాయాజ్ఞనీతి ధృతినిల్పెదు నే?

చ. సురపతిజారతం గలసెసుమ్మి యహల్యను, బ్రహ్మదేవుఁడున్
సరతనయన్ వరించె, గురుపత్నినిగూడి రమించెఁ జంద్రుఁడున్;
బరుఁడిఁకఁ గానిమార్గమును బట్టనివాఁ డెవఁ డస్మదాజ్ఞచే?
నరయ మదీయ మచ్చరములట్లు భ్రమింపఁగఁజేయు లోకమున్?

రతి—ఓ ప్రాణేశ్వరా! అదియంతయు సత్యమేకాని, శత్రుఁడు సహాయసంప

త్నుఁడు గనుక శంకింపవలసియున్నది. యమనియమ ప్రముఖులయిన యోగని మంత్రులు మహాబలవంతులని వినుచున్నాను.

కాము—ఓప్రియురాలా! నీవొక్క బలవంతుఁడయిన యావివేక మహారాజు యొక్కయమాది మంత్రులనే తలఁపున నిలుపుచున్నావుకాని మమ్ము విచారింప కున్నావు. మేము పూనికతోఁ దారసించినంతమాత్రముచేతనే వారందఱును నిమిషములోఁ జెల్లాచెదరగుదురుసుమా!

గీ. ఇచటి క్రోధునియెదుర సహింపరెంత?
బ్రహ్మచర్యాదులెంత సాహజ్జఁ జూడ?
వినుము సత్యాదు లస్తేయుఁడు నపరిగ్ర
హంబు నెంతవా రాలోభునొద్దఁ జెపుము.

యమ, నియమ, ఆసన, ప్రాణాయామ, ప్రత్యాహార, ధ్యాన, ధారణ, సమాధులు నిర్వికారచిత్తులకడనే కాని యుండరు గాన వారిని సులభముగానే నశింపఁ జేయ వచ్చును. అంతేకాక వారిపాలిటి మృత్యుదేవతలైన స్త్రీలును నాకధీనురాండ్రయి మెలఁగుచున్నారు.

ఉ. వారివిలోకనంబులును వారిసుభాషణముల్ విలాసముల్
వారల కౌఁగిలింతలును వారలహాసముఁ గ్రీడలేల? య
వ్వారలనామసంస్మరణభాగ్యమె చాలు హృదంతరంబులం
దారయ నిర్వికారులకునైన వికారము పుట్టఁజేయఁగన్.

విశేషించి వీరు మనప్రభువారి యాప్తులయిన మద, మాత్సర్య, దంభాదులకు లోఁబడినవారయి మనరాజుగారి మంత్రియైన యధర్ముని నాశ్రయింతురు.

రతి—ఓహృదయేశ్వరా! మీకును శమ దమ వివేక ప్రభృతులకును జన్మస్థల మొక్కటియేయని విన్నదానను.

కాము—ఓహో! ప్రియురాలా! ఒక్కజన్మస్థలమే యేకమని చెప్పనేల? మాకు జనకుఁడును నొక్కఁడేసుమా! ఎట్లన—

ఉ. ఈశ్వరసంగమంబునను నెంతయుఁ దొల్తను మాయయందు నీ
విశ్వములో మనస్సనెడు విశ్రుతుఁడౌసుతుఁ డుద్భవిల్లె; నా
యీశ్వరసూతియే మొదట నెల్లజగమ్ములుఁ జేసి మీఁదటన్
శాశ్వతకర్తయయ్యెను బొసంగఁ గులంబులుమావి రెంటికిన్.

అతనికిఁ బ్రవృత్తియు, నివృత్తియు, నని యిద్దఱు ధర్మపత్నులుఁగలరు. వారిలోఁ బ్రవృత్తి వలన మహామోహుఁడు మూలపురుషుఁడుగాఁగల మావంశము పుట్టినది. నివృత్తి వలన వివేకుఁడు మూలపురుషుఁడుగాఁగల యారెండవవంశము పుట్టినది.

రతి—ఓప్రాణనాయకా! అట్లయిన సహోదరులయ్యును మీలోమీకిటువంటి పరస్పరవిరోధ మెందుకు?

కాము—మ. ఇలనేకాంబికసంభవక్ష్మాపులకే యెందు న్మహావైరముల్
పెంపదన్వర్థులు పన్నదమ్ములకుఁ ; బృథ్వీనిర్వంతరోయాగతుల్?
కలుగవ్ లేద జనక్షయంబయిన సంగ్రామంబు మున్నీమహీ
స్థలిలోఁ బాండవకౌరవోత్తములకున్ ధాత్రీనిమిత్తంబునన్?

కావున జగత్తు సర్వమును మాపిత్రార్జితము. జనకునకు మాయంగాఁ బత్నియగుటచేత జగత్తంతయు చేమాక్రమించుకొనఁగా, నిలువలేక యజ్ఞాతుదశైన తనవారితో వివేకుఁడొకండుఁ దిరుగుచు నెక్కడనో యడఁగియున్నాఁడు. ఇప్పుడా పాపాత్ములందుచేతఁ దండ్రిని తమ్ములనుగూడ నిర్మూలము చేయుట కుద్యోగించుకొనియున్నారు.

రతి—పాపము శాంతించుగాక! పాపము శాంతించుగాక! ఓప్రాణేశ్వరా! విద్వేషమాత్రముచేతనే వారిప్పుడీపాపవ్యవసాయమునకుఁ బూనినారా? లేకయిప్పుడు వారాలోచించినయుపాయ మేదియయినఁగలదా?

కాము—దీనికిఁ గొంచెము గూఢకారణమున్నది.

రతి—ఓప్రాణేశ్వరా! అది నాకేల చెప్పవు?

కాము—నీవు స్త్రీస్వభావముచేతఁ బిఱికిదానవని నీకాపాపాత్ముల దారుణ ప్రయత్నమును జెప్పఁజాలకున్నాను.

రతి—ప్రాణనాథా అదియెటువంటిది?

కాము—ఓప్రియురాలా! భయపడఁబోకు. వారివి కేవల మాశాళులయినవారి కోరికలేసుమా! ఇప్పుడు కాళికాశక్తితో సమానురాలయిన విద్య యనురాక్షసి యొక్కతె మనవంశమునందుఁ బుట్టునని లోకప్రవాద మొకటి పుట్టినది.

రతి—(భయముతో) ఏమిగతి? మనకులమునందు రాక్షసి యెట్లుపుట్టునాయని నాహృదయము కంపమెత్తుచున్నది.

కాము—ప్రియురాలా! జడిసెదవు జడియకు. ఇది వట్టి కింవదంతియేసుమా!

రతి—తరువాత నారాక్షసి చేయఁగల పనియేమి?

కాము—ప్రియురాలా! బ్రహ్మదేవునిభార్య సరస్వతియనియొకతె యున్నది కదా! ఆమె యీప్రకారము చెప్పినదఁట.

స్రగ్ధర. సంగంబుల్ లేని యాయీశ్వరునివలన సంసర్గముక్ లేకయే లీ
లం గాంచెన్ భార్యమాయాలలన మనసనన్ శ్లాఘ్యపుత్రున్ జగంబుల్
పొంగారన్; వీరివంశంబునని పొడమెడున్ బుత్రియున్విద్యనాఁగన్;
మ్రింగుం దద్విద్యతండ్రిన్ బ్రికాజననిని భ్రాతృసంఘంబున్ గులంబున్.

రతి — (భయోత్కంపంబుతో) ఓ ప్రాణవల్లభా! రక్షింపుము. రక్షింపుము.

(అని భర్తను గాఁగిలించుకొనుచున్నది.)

కామ — (స్పర్శసుఖము ననుభవించి తనలో)

చ. పులకలు పూఁడ, జూపులను బొంగ్వఁగఁ దారకలాడఁ బైపయిన్
వలుదకుచద్వయంబు భయభావమునన్ వడఁకాడఁ, గింకణా
వళి చిఱుపాటపాడ, భుజవల్లులు నీసరశాక్షి కౌఁగిటన్
తెలుపుగఁ జేర్చి సొంపలరఁ జేసి, నను న్వివశాత్ముఁ జేసెడున్.

(గాఢాలింగనము చేసికొని ప్రకాశముగా) ప్రియురాలా! బెదరకు బెదరకు. మేము జీవించియున్నంతవఱకును విద్యయెట్లు పుట్టును?

రతి — ఆ రాక్షసి పుట్టుట మీ ప్రతిపక్షులకు సమ్మతమా యేమి?

కామ — అవును సమ్మతమే. ఆ విద్య వివేకున ఉపనిషద్దేవియందుఁ బ్రబోధచంద్రుఁడను సోదరునితోఁ గూడఁ బుట్టఁబోవుచున్నది. శమదమాదులందఱునందులకు మహాప్రయత్నము చేయుచున్నారు.

రతి — ఓ హృదయేశ్వరా! ఆత్మవినాశహేతువయిన విద్యయొక్క యుత్పత్తికా దుర్వినీతు లెట్లు సంతోషించుచున్నారు?

కామ — ఓ ప్రియురాలా! కులక్షయప్రవృత్తులయియున్న పాపకర్ములు ప్రత్యపాయము నెట్లు గణింతురు? చూడు.

చ. అరయ స్వభావదుష్టకుటిలాత్ములసంభవ మెల్లయప్పుడున్
గరము వినాశహేతువగుఁ గాతముకుం దముఁ గన్నవారికిన్?
ధరణిని ధూమసంచయము తా నలమేఘపదంబు నొంది స
త్వరముగ నగ్ని నార్చి తరువాతను దానును నాశ మొందదే?

[తెరలో]

ఆ! పాపీ! దురాత్మా, ఏమిరా! పాపకర్ములమని మమ్మే యాక్షేపించుచున్నావు! ఔరా!

గీ. "గర్వితుండైన, నుమార్గగామియైనఁ,
దా నొకింత కార్యాకార్యదక్షబుద్ధి
కానివాఁడైన, గురు నేని కార్యమెంచి
వసుధలోఁ బలఁద్యజియింపవలయుఁ జుమ్మి."

అను పౌరాణికగాథను బురాణవేత్త లుదాహరించియున్నారు. అదిగాక యీ మా జనకుఁడే యహంకారునితోఁ జేరి తన తండ్రియయిన జగత్పితను బంధించియున్నాఁడు. అతనిని మోహాదులు గూడ దృఢపాశబద్ధుని జేసియున్నారు.

కామ — ఓ ప్రియురాలా, అది మాకులవృద్ధుఁడయిన వివేకుఁడు భార్యయగు

మతిదేవితోఁగూడ నిక్కడకే వచ్చుచున్నాఁడు.

మ. వనితా! చూడుము చిక్కి మానధనుఁ డావంక న్వివేకుండు తె
ల్విని గన్పట్టెడుఁ గాంతి గోల్పడి, కడున్ స్వేచ్ఛానుసంచారులౌ
ఘనరాగాదులచేఁ గలంగినమతిస్మద్భృత్యుకంచం గూడి, కా
ట్లొక్కను పెన్మంచునఁ గాంతివాసినశశాంకుంబోలి భీతాత్ముఁడై.

ఇఁక మనమిక్కడ నిలువఁగూడదు. (అని నిష్క్రమించుచున్నారు.)

ఇది విష్కంభము.

[అప్పుడు వివేకమహారాజును, మతిదేవియుఁ, బ్రవేశించుచున్నారు.]

వివే—(ఆలోచించి) ఓప్రియురాలా! దుర్వినీతుఁడయినయీబ్రహ్మచారియొక్క గర్వయుక్తమయిన మాటలు నీవు విన్నావుగదా? వీఁడు పాపాత్ములమని మనలనే యాక్షేపించుచున్నాఁడు!

మతి—ప్రాణేశ్వరా! లోకులు తమదోషముల నేల యెఱుఁగఁజాలరు?

వివే—ప్రియురాలా! చూడు.

శా. ఆహా! పాశముల న్నిరంజనుని జ్ఞానానందు నయ్యీశ్వరున్
మోహాంభోనిధిలోఁ జిరంబుగఁ గరంబు న్ముంచి బంధించి గా
ఢాహంకారపరుల్ దురాత్మకులు నాయాదుర్మదాదుల్ మహో
త్సాహంబొప్పఁగ నీశు దీనదశ నొందంజేసి రత్యంతమున్.

అట్టివారు పుణ్యాత్ములఁట! ఆదురాత్ములచేతఁ బరాభవింపఁబడినయీశ్వరునివిముక్తుని జేయుటకయి ప్రవర్తింపుచున్నమనమేమో పాపకారులమఁట!

మతి—ఓప్రాణేశ్వరా! పరమేశ్వరుఁడు సహజానందసుందరస్వభావుఁడనియు నిత్యప్రకాశుఁ డనియు సకలభువనప్రచారుఁడనియు వినుచుందుము. అట్టివాఁడేల యీదుర్వినీతులచే బంధింపఁబడి మహామోహసాగరమునందుమునిఁగిపోయినాఁడు?

వివే—ఓప్రియురాలా!

సీ. సతతమహోన్నత ధృతిమంతుఁడయ్యును సదమలసంపూర్ణకాంతుఁడయ్యుఁ
బరిబలతరైశ్వర్యభాసమానుండయ్యు మహితసంతతనీతిమంతుఁడయ్యు
నసమానఘననిశ్చలాంతఃకరణుఁడయ్యు సమయానుగుణ ధీవిశాలుఁడయ్యుఁ
దరుణులమాయలఁ దగులొందిపురుషుండు త్యజియింపఁడే తనధైర్యగరిమ?
నట్లె యామహాపురుషుండు నరయ నిపుడు
వఱలుమాయామహాదేవివలలఁ దగిలి

చిరతరానూన సంబంధ గరిమకతన
దన్నుఁదా నెఱుంగఁగఁ జాలకున్నవాఁడు.

మతి—ఓప్రాణేశ్వరా, అట్లు సంభవింపదు. సహస్రకిరణుఁడైన సూర్యుఁడంధకారరేఖచేతఁ గప్పఁబడుట సంభవించునేని, అప్పుడు దేదీప్యమానప్రకాశసాగరుఁడైన యాదేవుఁడును మాయచేత నడఁగియుండుట తటస్థింపవచ్చును.

వివే—ఓప్రియురాలా! ఆమెజాడ యిట్టిదని యూహించుట మనకు శక్యము కాదు. వారకాంతవలెనే యామాయాదేవి యసత్యములయిన భావములను గనఁబఱచుచుఁ దానాపరమపురుషుని వంచించుచున్నది. చూడు చూడు.

చ. స్ఫటికము భంగి స్వచ్ఛరుచి భాసిలు దేవు స్వయంప్రకాశునిన్
గటకట! యల్పురాలయి వికారవిధేయునిఁ జేసె మాయ; ప్రా
కటమగు దానిసంగతిని కాంతినొకింతయుఁ గోలుపోఁ డతం
డటులయియున్, ఘటించెడును నాతనికామె యధీరతం గడున్.

మతి—దుర్విదగ్ధురాలయిన యామె యేకారణముచేత నుదారచరితుఁడయిన యామహామహుని వంచించుచున్నది?

వివే—ప్రయోజనమును గానికారణమును గాని విచారించి మాయవర్తించుచుండుట లేదు. స్త్రీపిశాచముల కది స్వభావమే. చూడు.

చ. నరులదయార్ద్ర కోమలమనంబులు లోఁగొని వామలోచనల్
సరగున నేమిచేయుటకుఁ జాలరు తారు ధరాతలంబునన్?
పురుషులమోహపెట్టుదురు, బుద్ధిగలంతురు, విషాదపెట్టుదుర్.
మరి వెరపింతురు, రాసలఁ గరంతురు, చేయుదు రాత్మదాసులన్.

మఱియొక కారణముగూఁడ గలదు.

మతి—ప్రాణేశ్వరా! అదియేది?

వివే—దురాచారురాలయిన యామె "నేనిప్పుడు యౌవనముపోయి యేండ్లు చెల్లినదాననయి యున్నాను. ఇతఁడును బురాణపురుషుఁడు; స్వభావముచేత నేవిషయసుఖవిముఖుఁడు. కాఁబట్టి నాతనయుని నే పరమేశ్వరపదమునందు నిలిపెదను." అని యాలోచించినది. తల్లియభిప్రాయము నెఱిఁగి భేదమేమియులేక యామె నేపోలిన మనస్సును నవద్వారములు గలపురములను నిర్మించెను.

గీ. ఒక్కఁడయ్యును వహియించి పెక్కురూపు
లలశరీరపురంబుల నతఁడు చొచ్చి,
స్ఫటికమణిఁబోలి యాత్మచేష్టలను దాను
వానివానికిఁ దగ నలవఱ్చుకొనియె.

మతి—(ఆలోచించి) ఓప్రాణేశ్వరా! తల్లియెటువంటిదో పుత్రుఁడునటువంటి వాఁడే పుట్టునుగదా!

వివే—అప్పుడు మనస్సుయొక్క శ్రేష్ఠపుత్రుఁడును దనమున్నమనమఁదనునయిన యహంకారుఁడువచ్చి తన్నుఁ గౌఁగిలించుకొనఁగాఁ బరమాత్ముఁడు—

చ. భ్రమసి, యవిద్యచే మునిఁగి దారుణుఁడై, యీశ్వరుఁడా మనస్సుచే
యు మహితకల్పనందగిలి, 'యింద్రభవమందిరి; వీరు నాపితల్;
విమతులుఁ బుత్రమిత్రులును వీరె; కులంబు బలంబు విద్యద్రి
వ్యమనివె; భార్య యీమెయని స్వప్నములీకని పెక్కులొందెనున్.

మతి—ఓప్రాణేశ్వరా! ఈప్రకారముగా నతిదీర్ఘతరమయిన నిద్రచేతఁ బ్రబోధము చెడియున్న పరమేశ్వరునియందుఁ బ్రబోధ సంభవ మెట్లు గలుగును?

వివే—(లజ్జతో నధోముఖుఁడయి యున్నాఁడు.)

మతి—ప్రాణేశ్వరా! గురుతరలజ్జాభరముచేత శిరస్సువంచుకొని యూరకున్నా రేమి?

వివే—ప్రియురాలా! స్త్రీలహృదయములు తఱుచుగా నీర్ష్యను బొందును. అందుచేత నేను సాపరాధుఁడ నగుదునుగదాయని శంకించుచున్నాను.

మతి—ప్రాణేశ్వరా! అన్యాశ గలిగిన స్త్రీలుమాత్రమే తమకుఁబరత్రఁ దగు ధర్మార్జనవ్యాపారమునందుఁ దగిలియున్న భర్తలయొక్క మనోభీప్సితములకు విఘ్నములు చేయుదురు.

వివే—ఓ ప్రియురాలా!

శా. ఉగ్రోద్యద్విరహార్తియా నుపనిషద్యోషిన్మణీయోగ ను
య్యగ్రశ్లాఘ్యుల శాంతిముఖ్యుల సుసాహాయ్యాప్తి నాకబ్బినన్,
జాగ్రత్త్రన్ క్షణకాలమీవు విషయేచ్ఛల్ మాని వర్తించినన్,
జాగ్రత్స్వప్నసుషుప్తిధామవిరతిన్ గల్గుం బ్రబోధుండిలన్.

మతి—ఓప్రాణవల్లభా! అహంకారాభిమానియయినను గులప్రభువను బంధమోక్షము కలిగెనుపక్షమున, అప్పుడు దేవరవారి కామెతోడి నిత్యానుబంధము కలుగునుగాక యనియే నాకోరిక.

వివే—అలాగున నయినపక్షమున, నామనోరథముల చిరముగాఁ బ్రసన్నములును సిద్ధములు నగునట్టె. అట్లేకదా—

సీ. జగములకాదియు శాశ్వతుండుఁ బ్రభువు నై వెలఁగొందు మహానుభావు
బహులవిధంబులఁ దాముభాగించి, దేహానివేశంబులందుఁ బ్రవేశపెట్టి,

బద్ధునిగాఁ జేసి, పరమ మృత్యుపదంబు ప్రాపింపఁజేయఁగఁ బదిలపఱిచి,
యుడు బ్రహ్మేంద్రదేవులైన యవ్వారికి మఱిజాఁతికిఁ బయి మఱియు శాస్త్ర
విహితమైన ప్రాయశ్చిత్త విధిని నేను
మహితవిజ్ఞాన మహిమచే మహినొనర్చి,
మరలస్థాపింపవాఁడఁబో స్థిరముగాను
బూని బ్రహ్మలోకభాగంబుఁ బుడమిమీఁద.

అట్లగుఁనుగాక! ప్రస్తుతకార్యసిద్ధికొఱకుఁ బ్రబోధోత్పత్తి నిమిత్తము శమాదులను సమకూర్తము.

(ఇద్దఱును నిష్క్రమించుచున్నారు.)

# ద్వితీయాంకము.

[అంతట దంభుఁడు ప్రవేశించుచున్నాఁడు?]

దంభు—"వత్సా! దంభా! అమాత్యసహితుఁడయి వివేకుఁడు ప్రబోధోదయార్థము గాఁ శమదమాదుల నాయాతీర్థములకుఁ బంపియున్నాఁడని విన్నాఁడను. ఆసన్న మగుచున్న మనకీయాపదను మాన్పుటకయి మీరు శ్రద్ధవహించి ప్రతిక్రియ చేయవలెను. భూమండలములోఁ బరమముక్తిక్షేత్రమయి వారణాశీనగరమున్నది. నీవందుఁ బోయి నాలుగాశ్రమములవారియొక్కయు మోక్షకార్యవిఘ్నమునిమిత్త మతిప్రయత్నము చేయవలెను." అని మహామోహ మహారాజుగారు నాకాజ్ఞాపించియున్నారు. కాఁబట్టి నాకు వశ్యులయినవారితో నిండియున్న యీవారణాశీపురమునందు నేనిప్పుడుమా ప్రభువువారు సెలవిచ్చినట్లుగా వారియాజ్ఞలను నిర్వహించితిని. ఇప్పుడిక్కడ నాయాశ్రితులు (దాంభికులు)

చ. గణికలయిండ్లఁ గంపొదవు కాంతల యాననసీధు వానుచున్,
బ్రణుతరతోత్సవంబులను రాత్రులు వెన్నెలలోనఁ బుచ్చి, బ్రా
హ్మణులమటంచు దీక్షితులమంచుఁ దపస్వులమంచుఁ బండితా
గ్రణులమటంచు ధూర్తులు జగంబును మోసమొనర్తు రెంతయున్.

(చూచి) భాగీరథినిదాటి యిప్పుడీవంకనే వచ్చుచున్నాఁడు. ఈపాంథుఁ డెవఁడయి యుండును?

గీ. ఒకట నభిమానమున మండుచున్నయట్లు,
మించి లోకత్రయంబును మ్రింగునట్లు,

పృథులవాగ్జాలమున బెదరించునట్లు,
ప్రజ్ఞచే నవ్వునట్లుఁ, గన్పడెను వితఁడు.

ఇతఁడు దక్షిణరాధాదేశమునుండి వచ్చియుండునని నేనూహించెదను. కాఁబట్టి నేనితని వలనఁ బూజ్యుఁడయిన యహంకారుని వృత్తాంతమును దెలిసికొనెదను.

[అప్పుడు పయిని చెప్పినట్లహంకారుఁడు ప్రవేశించుచున్నాఁడు]

అహం.— ఓహో! ఈజగత్తంతయు మూర్ఖమయ మయియున్నది. ఎట్లన—

చ. గురుమతము న్వినంగనరు; గోప్యకుమారిల శాస్త్రరీతిఁగా
నరు; విన రాప్రభాకరుఁడొనర్చినబోధ; యుఁకేల దేవతా
గురుకథ? శేషుభాగ్యమునుగోరరు; సూక్ష్మపదార్థతత్వముల్
నరపశువుల్ గ్రహింపరు; తలంపరు పాశుపతంబు స్వస్థులై.

(చూచి) వీరజ్ఞానశూన్యులు ; కేవలస్వాధ్యాయపరులు ; వేదములను నీటఁ గలపుచున్నారు. (మరలి మఱియొక చోటికి నడచి) వీరుభిక్షుకులకొరకే యతివేషమునుఁ గ్రహించినారు; శిరోముండనములు చేసికొన్న యీపండితంమన్యులు వేదాంతశాస్త్రమును బాడుచేయుచున్నారు. (నవ్వి)—

గీ. మహిని బ్రత్యక్షముఖ్యప్రమాణసిద్ధ
ఘనవిరుద్ధార్థములు వీరె జనములకును
బోధచేయుచునుండంగఁ, బుడమివాఁడు
బౌద్ధవాదులకడఁ గలపాపమేమి?

ఇట్టివీరి సంభాషణలు విన్నను మహాపాతకము సంభవించును. (మరలమరియొక చోటికి నడచి) వీరు కష్టపడి తర్కమతము నభ్యసించిన శైవపాశుపతాదులు. ఈపాషండులు కేవల పశువులే. వీరితో సంభాషించినవారు సహితము నరకములపాలగుదురు. అందుచేత వీరిని దృష్టిపథమునుండి దూరముగాఁ బరిహరింపవలయును. (మరలమఱియొక చోటికి నడచి)—

ఉ. అల్లదె గంగయొడ్డు శిలలందుఁ గుశాస్తరణోపవిష్టులై,
యల్లన దర్భముష్టియుతహస్తము లొప్పఁగఁ, బూజపెట్టెల
ల్లల్లన నిల్పి, పూసలెగయం గొనవ్రేళుల నక్షమాలికల్
ఫెల్లుగఁ ద్రిప్పుచున్, ధనికవిత్తములన్ హరియింతురి దాంభికుల్.

(మరల మఱియొక చోటికి నడచి) వీరు త్రిదండివేషములచేత జీవనముచేసెడు ద్వైతాద్వైతమార్గపరిభ్రష్టులు. (మరలవేఱొక చోటికి నడచిచూచి) ఓహో! ద్వారసమీపమునందు నాటిన నిడుదలగు వెదురుగడలకుఁ గట్టియున్న తెల్లని సూక్ష్మవస్త్రసహస్ర

అహం—(తనలో) కానిమ్ము. ఇట్లు చేసినాపటవలనే దోష మేమున్నది? (అలాగునఁ జేసి దాపునకు వచ్చుచున్నాఁడు.)

దంభు—(పండ్లుకొఱికి) నీవు దూరముగానుండుము. గాలితోఁ గలిసి చెమట బిందువులు మామీఁదికి వచ్చును.

అహం—ఓహో! ఈబ్రాహ్మణ్య మపూర్వమయినదిగానున్నదే!

వటు—ఓబ్రాహ్మణా! అందున సందేహ మేమి? వీరిసన్నిధిని—

గీ. పూజ్యపాదాబ్జయుగళంబు ముట్టుకొనక,
భక్తిఁ బీఠాంతభూతలభాగమునకె
స్వీయ చూడామణి మరీచివితతిచేత
నృపతివరులు నీరాజనం బిడుదు రెపుడు.

అహం—(తనలో) ఈదేశము కేవలదాంభికుల కనుకూలమయినది. కానిమ్ము. ఈపీఠముమీఁద గూరుచుండెదను. (అనికూరుచుండఁ బోవుచున్నాఁడు.)

వటు—ఆరాధ్యపాదులవారి యీపీఠము నన్యులాక్రమింపఁగూడదు

అహం—ఓరిపాపాత్ముఁడా! దక్షిణరాధాదేశమున ప్రసిద్ధులయినమావంటి పరిశుద్ధులకుసహిత మీపీఠము నెక్కఁదగరా? ఓరిమూర్ఖా! మాకులశీలములు వినుము—

ఉ. మాత మహాకులీన ; మఱి మత్సతి శ్రోత్రియపుత్రి ; యోటనేఁ
బూతుఁడఁ దండ్రికంటె; విను పూర్వము మత్సతియన్న మిత్రుస
మ్మాతులపుత్రిమీఁద నను మాతృ మబద్ధపునింద రా, నప
ఖ్యాతిపుబాంధవం బని ప్రియాంగనఁ బోసిడి నైతి శుద్ధుఁడన్

దంభు—ఓబ్రాహ్మణా! అదియంతయు నట్లేయయియుండును. అయినను నీవు మావృత్తాంతము తెలియదు.

చ. మును పాకసా బ్రహ్మపురముం గనివచ్చుటకేను బోవఁగా,
మునివరులాత్మ పీఠచయముం డిగి రెల్లరు నన్నుఁ జూచి; యా
వనజభవుండు నన్నుఁ బ్రియభాషలఁ దేలిచి, శుద్ధిగాఁగ ది
గ్గున నుపవిష్టుఁ జేసె నవగోమయలిప్త నిజోరుపీఠికన్.

అహం—(తనలో) ఆహా! ఏమి యీదాంభికబ్రాహ్మణుని యత్యుక్తి! (ఆలోచించి) ఇతఁడొకవేళ దంభుఁడే యేమో! అయినంగానిమ్ము. (కోపముతో బిగ్గరగా) ఓరీ! నీవేలగర్వపడెదవు?

చ. శతముఖుఁ డెంతవాఁడు? మఱి సారసగర్భుఁ డనంగ నెంత ? యా
క్షితిపయి నేమిలెక్క మునిసంఘము? తెలియంగవు నీవుమత్ప

స్తితమహిమంబు; వాసవశతంబును బ్రహ్మశతంబు బోనిలా
ట్పకమును గూలలేదె పెనుసన్ గతిగానక నేను జూడఁగన్

దంభు—(చూచి సంతోషముతో) ఓహో! అయ్యా! మీరు మా పితామహులైన యహంకారులు దేవా! లోభునియాత్మజుఁడ నయినదంభుఁడను నేను మీకు నమస్కారము చేయుచున్నాను.

అహం—వత్సా! దీర్ఘాయుష్మంతుఁడవు కమ్ము. నేను ద్వాపరాంతమునందుఁ జూచినప్పుడు నీవు బాలుఁడవు. చిరకాలమెడఁబాసియుంటచేతను వార్ధక్యగ్రస్తుఁడ నగుటచేతను నిన్నిప్పుడు తిన్నఁగా గుఱుతుపట్టలేక పోయినాఁడను. మఱి నీకుమారుఁడయిన యసత్యునకుఁ గుశలమా?

దంభు—అతఁడు క్షేమముతోనున్నాఁడు. అతఁడును మహామోహమహారాజుగారి యాజ్ఞ ననువర్తించుచు నిక్కడనే యున్నాఁడు. అతనిని విడిచి నేనొక్క ముహూర్తకాలమయినను బ్రాణములు నిలుపఁగలుగుదునా?

అహం—నీతల్లిదండ్రులయిన తృష్ణయు లోభుఁడును గుశలులయియున్నారా?

దంభు—వారును నిక్కడనే యున్నారు. వారులేక నేను క్షణమయినను నిలువలేను. పూజ్యులయిన తమరిక్కడ కేపనిమీఁద దయచేసినారు?

అహం—వత్సా! వివేకునివలన మహామోహున కేమాయుపద్రవము కలుగనున్నదని విని యాతనివృత్తాంతమును దెలిసికొనవలెనని వచ్చినాను.

దంభు—తమరాక మేలయినది. మహామోహమహారాజుగారింద్రలోకమునుండి నేఁటరేపట నిచ్చటికే వచ్చుచున్నారని విన్నాను. ఆయన యీవారణాసీనగరమునే రాజధానిగాఁ జేసికొందురనియు నొకలోకప్రవాదము పుట్టినది.

అహం—సమస్తాత్మలయందును వాసముచేసెడుమహామోహుఁ డీవారణాసియం దుండఁగోరుటకుఁ గారణమేమి?

దంభు—మఱియేమున్నది? వివేకుని నడ్డగింపవలయుననియే.

గీ. శాశ్వతబ్రహ్మపురి కాశి, జన్మభూమి
యతని విద్యాప్రబోధోదయముల కరయఁ;
గులవినాశనవిధి కెత్తుకొన్నయావి
వేకుఁడిందుండఁ గోరెడు విడువ డెపుడు.

అహం—(భయముతో) అట్లయినపక్షమున దీనికిఁ బ్రతీకార మవశ్యమైనదే.

క. పుర హరుఁడు హరుఁడు శరణం
బరమపద జ్ఞాన శూన్యమానవతతి కి
స్ఫురి భవభయ హరతారక
మురభిగ నవసానవేళ నుపదేశించున్.

దంభు—అది సత్యమే. అయినను గామక్రోధాద్యభిభూతుల కది లభింపదు. కావునబట్టియే పెద్దలిట్లు చెప్పుచున్నారు—

క. విద్యా తపో యశస్సుల
హృద్యముగఁ గరంబు లంఘ్రి లెవడు నెవనికి
య్యాద్యమ్మని శివుఁజేరునో యాన
విద్యుత నాతండె తీర్థఫలమును బొందున్.

[తెరలో]

ఓహో! జనులారా! ఇదె మహామోహమహారాజుగారు వచ్చుచున్నారు.

చ. స్ఫటికమణీవితర్దికలఁ జల్లుఁడు చందనగంధతోయముల్;
పటుగతి యంత్రమార్గముల పన్నుఁడు వారిగృహాంతరంబులన్;
స్ఫుటముగఁ గట్టుఁ డెల్లెడల భూరిలసన్మణితోరణావళుల్;
చిటుకున నింద్రచాపసమచిత్రపతాకల నెత్తుఁ డంతటన్.

దంభు—అయ్యా! మహారాజుగారు సమీపమునకు వచ్చినారు. కాఁబట్టి మీ రాయన కెదురుగాఁబోయి గౌరవింపవలయును.

అహం—ఆలాగుననే చేయుదము. (ఇద్దఱును నిష్క్రమించుచున్నారు.)

ఇది ప్రవేశకము.

—:o:—

[అప్పుడు మహామోహమహారాజుగారు మహావైభవముతోఁ బరివార సహితముగాఁ బ్రవేశించుచున్నారు.]

మహామోహుఁడు—(నవ్వి) ఓహో! మూఢులు నిరంకుశులు గాదా?

చ. కలదఁట! యాత్మయొక్కటి జగంబున దేహముకంటె వేఱుగా!
ఫలమది మీఁదగాంచునట, భద్రముగాఁ బరలోకమందహో!
వలవనియాదురాశయ్యొ నభస్తరురాజము పూచి స్వాదుస
త్ఫలముల నిచ్చునన్న భ్రమవంటిది కాదె తలంచిచూడఁగన్?

ఇటువంటి స్వకపోలకల్పనచేత లేనిపదార్థము నొకదానిని నిర్మించి దుష్పాండిత్యముగల ప్రబుద్ధులీప్రపంచమును వంచించుచున్నారు.

శా. అహా! లేనిపదార్థమున్నదని మిథ్యల్ పల్కు నయ్యాస్తిక
ద్రోహుల్ నాస్తికులంచు దూష్యులనుచున్ దూషింతురు సత్యార్థ్యులన్
మాహాత్మ్యస్థితిఁ బంచభూతపరిణామంబౌచు జైతన్య సం
దోహం; బెవ్వరు దేహభిన్నునిఁగ నెందుం జూచిరే జీవునిన్?

వీరు తమ్ము మాత్రమే కాక లోకమునంతను వంచించుచున్నారు.

మ. తనువుల్ వక్త్రముఖాంగ సంచయము చేతన్ దుల్యముల్ కాఁగ, నే
ల వర్ణక్రమ మేలా కులముల్? పరాంగన యి దన్యార్థంబు బిదన్ భేదముల్
గనరా వింతయినాకు! హింస బరకాంతా స్వాపతేయాక్రమం
బును దోషంబని కల్పనల్ సలిపి రింపుల్ పుట్ట నిష్పౌరుషుల్.

(ఆలోచించి శ్లాఘనతో) ప్రత్యక్షమే ప్రమాణమగుటనుబట్టి సర్వవిధములచేతను లోకాయత శాస్త్రమే శాస్త్రము. "పృథివ్యాపస్తేజో వాయువులు తత్త్వములు; అర్థకామములు పురుషార్థములు; భూతములే జ్ఞానజనకములు; పరలోకము లేదు; మృత్యువే మోక్షము" అని యీశాస్త్రమున నస్మదీయాభిప్రాయానుసారముగా వాచస్పతి రచియించి చార్వాకునికి సమర్పించెను. అతఁడు శిష్యోపశిష్యమార్గమున దానిని లోకమున వ్యాపింపఁజేసెను.

[అంతటఁ జార్వాకుఁడును శిష్యుఁడును బ్రవేశించుచున్నారు.]

చార్వా—వత్సా—నీ వెఱుఁగుదువు. దండనీతియే విద్య; దానిలో నంతర్భూతమయినదే వార్త. త్రివేదములును ధూర్తప్రలాపములు. చూడుము—

గీ. యజ్వలకు ద్రవ్యనాశ క్రియాదికంబు
వలన స్వర్గఫలంబది వచ్చునేని,
ధరణిలో దావవహ్ని దగ్ధంబులైన
పాదపంబులవలనను ఫలములొదవు.

మఱియును,

గీ. పుడమిలో యజ్ఞమునఁ జంపఁబడెడునట్టి
పశువునకు స్వర్గసౌఖ్యంబు వచ్చునేని,
యజ్ఞపశువునుగాఁ జేసి యజ్ఞకర్త
స్వర్గసుఖమందఁ దనతండ్రిఁ జంపరాదె?

క. మరణము నొందిననరులకుఁ
గరమును శ్రాద్ధంబు తృప్తి గలిగించెడుచో
ధగ మాఱిన దీపంబున
గురుకాంతిని దైలదాన ముత్పాదించున్.

శిష్యు—ఆచార్యా! ఈప్రకారముగాఁ బురుషులకుఁ దినుటయుఁ ద్రాగుటయు నే పురుషార్థములయినపక్షమున, ఈ తైర్థికులు సంసారసుఖమును విడిచియేల తామఘోరతరములయిన పారాకసాంతపనకృచ్ఛ్రాదు లగుదుఃఖములచేత శ్రమపడుచున్నారు?

చార్వా—వంచకప్రణీతములయిన యాగములచే మోసపోయిన యీమూర్ఖుల కాశామోదకములచేతనే యిట్టితృప్తి కలుగుచున్నది. చూడు—

భుజనిపీడిత ఘనబాహుమూల భుగ్న
కుచయుగాభోగకాంతోపగూహ మేడ?
భ్రష్టబుద్ధుల భిక్షోపవాసనియమ
సూర్యకరతాపమున దేహశోష మేడ?

శిష్యు—ఆచార్యా! దుఃఖమిశ్రితమయిన సంసారసుఖము పరిహరింపఁదగినదని యీవిధముగాఁ దైర్థికులు చెప్పుదురుగదా?

చార్వా—(నవ్వి) ఇది యానరపశువులయొక్క దుర్బుద్ధివిలసనము.

చ. అవనిని దుఃఖమిశ్రితములౌటను నింద్రియజన్య సౌఖ్యముల్
తివిరి త్యజింపఁబోలు ననుధీరులు మూర్ఖులె కాతలంపఁగన్
జవిగల తెల్లబియ్యమున సారతరంబగు శాలిధాన్యముల్
ధవులఁ ద్యజించునే యూకఁ దాల్పనటంచు వివేకి యెవ్వఁడున్?

మహామోహు—ఓహో! చిరకాలమునకుఁ బ్రామాణికములయిన వచనములు కర్ణసుఖమును గలిగించుచున్నవిగదా! (చూచి యానందముతో) ఇతఁడు నాప్రియసఖుఁడయిన చార్వాకుఁడా?

చార్వా—(చూచి) ఇతఁడు మహామోహమహారాజు. (సమీపమునకుఁబోయి) జయమగుఁగాక! జయమగుఁగాక! ఓమహారాజా! ఇదిగో చార్వాకుఁడు ప్రణామము చేయుచున్నాఁడు.

మహా—చార్వాకా! నీకు స్వాగతము. ఇక్కడఁ గూరుచుండుము.

చార్వా—(కూర్చుండి) ఇది కలియొక్క సాష్టాంగప్రణామము.

మహా—అచ్చటఁ గలి కవ్యాహతకుశలమా?

చార్వా—దేవరవారి ప్రసాదమువలన సర్వత్ర కుశలమే. అతఁడు కార్యశేషమును గూడఁ దీర్చి మఱి దేవరపాదములను సందర్శింపఁగోరుచున్నాఁడు.

చ. ఎవఁడు, మహాత్తరంబయిన యేలికయాజ్ఞనుబూని దాని శా
స్త్రవహనంబున న్నలసి తత్ఫలబద్ధుఁడు ప్రసాదుఁడై,

# ద్వితీయాంకము.

యవిరళహర్షపూర్ణహృదయంబున దిగ్విజయి స్వస్వామి పా
దవనజవందనం బిడు, నతం డతిధన్యుఁడు భృత్యకోటిలోన్

మహా— ఇప్పు డా కలి యేమేమి చేసియున్నాఁడు?

చార్వా—దేవా! చిత్తగింపుము—

చ. శ్రుతివిహితార్థమార్గము చొప్పు దొలంగి మహాజనుల్ యథే
ష్టతఁ జరియించువారయిరి జంకును గొంకు నొకింత లేక; యీ
గతికిని హేతు వాకలియుఁ గాఁడు, మదీయబలంబుఁ గాదు; వి
శ్రుతముగఁ బౌరుషంబుఁ గనుచుం బ్రభుమన్ననయే ఘటాళికిన్.

అక్కడ నుత్తరపథికులును పాశ్చాత్యులును వేదములనే త్యజించినప్పు డిఁక శమదమాదులకథ యేల? ఇతర స్థలములయందు సహితము వేదములు తలుమిగా జీవికామాత్ర ఫలములే యయినవి.

గీ. అగ్నిహోత్రంబు, వేదత్రికంబు, మఱి త్రి
దండమును, దేహమున భస్మధారణంబుఁ
బ్రజ్ఞయును బౌరుషము లేనిపందలకును
జీవిక లని బృహస్పతి చెప్పె మున్ను.

కాఁబట్టి కురుక్షేత్రాదులయందు విద్యా ప్రబోధచంద్రోదయమగునని దేవరవారు స్వప్నావస్థయందును శంకింపవలవదు.

మహా—చక్కగా సాధించినారు. ఆతీర్థమును వ్యర్థమయిన దానినిగాఁ జేయుట గొప్పపనికదా?

చార్వా—దేవా! దేవరవారికి విన్నవింపవలసినది మఱియొకటి యున్నది.

మహా—అది యేది?

చార్వా—విష్ణుభక్తి యను పేరుగల మహానుభావురాలయిన యోగిని యొక్కతె యున్నది. ఆమె సర్వత్ర సంచారము చేయుచుండఁ గలిచేత నిలుపఁబడిన దయ్యును, తదనుగృహీతులయినవారిని దేఱిచూచుటకును మేము శక్తులము కాకున్నాము. కాఁబట్టి దానికిఁ బ్రతీకారమును దేవరవారే సావధానముగా నాలోచింపవలయును.

మహా—(భయముతోఁ దనలో) అక్కటా! ప్రసిద్ధమహాప్రభావ యయినయా యోగిని మాకు స్వభావవిద్వేషిణి. దుస్సాధ్యురాలు. కానిమ్ము. (ప్రకాశముగా) ఓయీ! మనకీశంకతోఁ బనిలేదు. కామక్రోధాదులగు శత్రువులముందఱ దానిపని యెక్కడ సాగును?

శాంతిని బొందవిరోధుల సంతతకోపశిఖిస్ఫులింగముల్
సంతతితోడఁ బూర్ణముగ జ్ఞాతికులంబు నడంచునంతకున్.

(మాధ్వీ) వీరేమనప్రభువువారు. వారిదర్శనము చేసికొందము.

ఆనం—(సమీపమునకుఁబోయి) దేవా! జయమగుఁగాక! జయమగుఁగాక!

మహా—మాకు శత్రురాలయిన శ్రద్ధకూఁతును శాంతిని మీరు నిగ్రహింపవలెను.

ఆంద—దేవరయాజ్ఞాప్రకారము చేసెదము. (అని నిష్క్రమించుచున్నారు.)

మహా—శ్రద్ధకూఁతుగని పలుకటచేత నామనస్సున కొక్క యుపాయాంతరము సహితము పొడకట్టుచున్నది. శాంతి తనతల్లినైన శ్రద్ధకుఁ బరతంత్రురాలు. కాఁబట్టి యిప్పుడుమన మీయుపాయము చేతనైనను శ్రద్ధను పనిషద్దేవిసమీపమునుండి యాకర్షించి బంధించివేయవలెను. అప్పుడందువలన మాతృవియోగదుఃఖముచేత నత్యంతమృదుస్వభావ యయినశాంతి బలముడిగినదయి కృశించి నశించును. శ్రద్ధనాకర్షించి యొడఁబాటు చేయుటకు నాస్తికతావిలాసినియే పరమసమర్థురాలు. కాఁబట్టి యామెనే యీపనికి నియోగింపవలెను. (ప్రక్కనుజూచి) విభ్రమావతీ! నీవు సత్వరముగా నాస్తికతాదేవిని బిలుచుకొనిరా.

విభ్రే—ఏలినవారి సెలవుప్రకారము చేసెదను. (అని నిష్క్రమించి నాస్తికతో సహితయై మరలఁ బ్రవేశించుచున్నది.)

నాస్తి—సఖీ! చిరకాలమునుండి చూడకున్న మహారాజు ముఖమును నేనిప్పు డెట్లు చూతును? అతఁడు నన్నెగ్గలాడునేమో!

విభ్ర—సఖీ నీముఖదర్శనముచేత మహారాజు తనదేహమే తానెఱుఁగకుండును. అట్టిస్థితిలో నిన్నెట్లెగ్గలాడఁ గలుగును?

నాస్తి—సఖీ! నామిథ్యాసౌభాగ్యము నెంచి పరిహసించుచున్నావా?

విభ్ర—సఖీ! నీసౌభాగ్యముయొక్క మిథ్యాత్వమును నీ విప్పుడే తెలిసికొనఁ గలవు. సఖీ! నీకన్నులు నిద్రచాలక కలఁతనొందినట్లు కానఁబడుచున్నవి. ఇట్లు నాప్రియసఖి నేత్రములకు నిద్రతక్కువగుటకుఁ గారణమేమో.

నాస్తి—సఖీ! ఏకవల్లభయైన స్త్రీకిసహితము నిద్ర దుర్లభమగుచుండఁగా, బహువల్లభనైన నాకెట్లుండును?

విభ్ర—నాప్రియసఖికి వల్లభు లెవ రెవరో?

నాస్తి—ఈమహారాజొకఁడు, ఆపయిని కామక్రోధలోభాహంకారులు. అతివిస్తారము చెప్పఁబనిలేదు. ఈవంశమునందుఁ బుట్టినపురుషుఁడు పసివాఁడైనను ముసలివాఁడయినను బహుభువాఁడయినను రాత్రిందివములొక్కఁడును హృదయనివాసిని కాన

నన్ను విడిచియుండరు.

విభ్ర — సఖీ! కాముని రతియు, క్రోధుని హింసయు, లోభుని తృష్ణయు, పరమప్రియురాండ్రై యుందురు. తమ ప్రియులతో నిత్యమును రమించుచుండెడు వారయిన వారి కీర్ష్య యెట్లు కలుగకున్నది?

నాస్తి — సఖీ! ఈర్ష్యయని యేలపలికెదవు? వారుసహితము నన్ను విడిచి ముహూర్తకాలమయినను నిలువలేరు.

విభ్ర — సఖీ! నీసౌభాగ్యము వలన మనోవ్యాకులత నొందవలసినసవతులు సహితము నీయందు ప్రేమను గోరుచుండుట చేతనే భూమిమీఁద నీవంటి సౌభాగ్యవతి లేదని చెప్పుచున్నారు. సఖీ! ఇంకొకమాట చెప్పెదను. ఈవిధముగా నీవు స్వదారులహృదయము తొట్రిల్లకాళ్ళనుండి యందియలు జారి గళ్ళుగళ్ళుమని మ్రోఁగ నడుచు మహారాజును గౌరవించినప్పుడల్లను మనస్సులో శంకపడు నేమోయని నేనూహించెదను.

నాస్థి — ఇక్కడ శంకింపవలసినపని యేమున్నది? మహారాజుగారి నియోగానుసారముగా నే నీవేషము ధరించితిని. సఖీ! అంతేకాక దర్శనమాత్రముననే ప్రసన్నులగుపురుషులకు భయపడనేల?

మహా — (చూచి) ఇదిగో నాప్రియురాలు నాస్థికత సమీపించినది!

చ. ఒడలు నితంబగౌరవమునన్ జడ నొందఁగఁ, గొప్పపూసరం
బెడయఁగఁ జెయ్యివేడ్కఁ గరమెత్తనురోజనఖాంకముల్ బయ
ల్పడఁ, గనువల్లగల్వసరుల న్నగుచూపు లెసం గలంపఁగా,
నడవఁగ నూఁగుకంకణరుఝుణత్కృతితో నిదె కాంత వచ్చెడున్.

విభ్ర — అదిగో మహారాజు. ప్రియసఖీ! ఆయనసన్నిధానమునకుఁ బొమ్ము.

నాస్తి — (దగ్గరకుబోయి) మహారాజా! జయమగుఁగాక! జయమగుఁగాక!

మహా — ఓప్రియురాలా!

క. అంకమునఁ జేరి, ప్రకటన
ఖాంకస్తనముల నొసంగు మాలింగనమున్
శంకరునోడిలో నుండిన
శాంకరికో భావిలాససంపదఁ గనుచున్

నాస్థి — (చిఱునవ్వుతోఁ గౌగిలించుకొనుచున్నది.)

మహా — (ఆలింగనసుఖము నభినయించి) ఓహో! ఈమె కౌఁగిటఁ జేర్చినంతనే నాకిప్పుడు మరల నవయౌవనము కలుగుచున్నది! ఓవిలాసినీ!

కాదు వయోను విగ్రహమునన్ మును పెప్పుడో కల్గి, మానసో
త్కర్శ మొనర్చి, యింద్రియకదంబ సుఖైకపరాత్ముఁ జేసి, వే
మ్మాదరమున్ బెనంచిన యనంగవికారము నేఁడు నీవు నన్
గాదిలిఁ గౌఁగిలించుటనుగ్రహమ్మునఁ బుట్టె, మదాత్మ నీడ్చెడున్!

నాస్తి — ఓమహారాజా! నేనిప్పుడు నవయౌవనదశలోనున్నను, నామనస్సులో నాటియున్న నీమీఁది ప్రేమము కాలము గడచుటచేత సహితము పోలేదు సుమా! ఏ నిమిత్తముచేత దేవరవారు నన్నుఁ దలంచితిరో సెలవిండు.

మహా — ప్రియురాలా!

క. పడఁతీ! తలఁపఁగఁ జను మది
కెడముగ నున్నట్టివారి నెంతైనను; నీ
వెడఁబాయకుందు వెప్పుడు
చెడ కస్మచ్చిత్తభిత్తిచిత్రము పోలెన్.

నాస్తి - నాకిది మహాప్రసాదము. ఓమహారాజా! నాపనియేమో యాజ్ఞాపింపుఁడు.

మహా — ఈప్రకారముగాఁ బ్రకాశితములైన యంగములతో నీవు సర్వత్ర సంచరింపవలయును. ఇదిగాక తోత్తుకూఁతురు శ్రద్ధాకాంత వివేకునితో నుపనిషద్దేవిని గూర్చుటకయి దూతికాభావమును వహించినది.

గీ. మనసుఁ బ్రతికూల; పాపుల మైత్రిఁ దిరుగు;
నకులజ; కరంబుఁ బాపాత్మురాలు; శ్రద్ధ;
యిపుడె తలపట్టి యారండ నీడ్చి తెచ్చి
కినుకఁ బాషండులకు నొప్పగింపుమీవు.

నాస్తి — ఇంతమాత్రపుఁబనికిఁ బ్రభువువారికి శ్రమయక్కఱలేదు. వచనమాత్రముచేతనే దేవరవారి సేవకురాలగు శ్రద్ధ తమయాజ్ఞను చెల్లించును. "ధర్మము మిథ్య; మోక్షము మిథ్య; వేదమార్గము మిథ్య, సుఖభంగకరము లయిన శాస్త్రప్రలాపములు మిథ్యలు; స్వర్గఫలవిద్య మిథ్య." అని నాచేత బోధింపఁబడి యామె శ్రుతకాలీయులో వేదమార్గమును పరిపాలింపఁగలదు. ఇఁక నుపనిషత్తుమాట చెప్పనేటికి? అంతేకాక విషయానంద విముక్తమని మోక్షవిషయమున దోషములు నాక సుచిరకాలములోనే శ్రద్ధను నీ నుపనిషత్తునుండి విరక్తయగునట్లు చేసెదను.

మహా — ఇదియంతయు నిట్లు చక్కఁబడినపక్షమునఁ బ్రియురాలు నాకుఁగొప్ప ప్రియము చేసినదగును. (అని మరలనాలింగనము చేసి ముద్దుపెట్టుకొనుచున్నాఁడు)

శాన్తి — అయ్యో! శత్రుగారిట్లు బహిరంగముగాఁ బ్రవర్తించుటచేత నేను సిగ్గు పడుచున్నాను.

మహా — కానిమ్ము. మనము విశ్వాసగృహమునకే పోవుదము రమ్ము.

(అందఱును నిష్క్రమించుచున్నారు.)

## తృతీయాంకము.

[అప్పుడు శాంతిదేవి కరుణతోడఁగూడఁ బ్రవేశించుచున్నది.]

శాంతి — (కన్నీరు విడుచుచు) హా! మాతా! శ్రద్ధా! నీ వెక్కడ నున్నావు? నా కొకసారి నీ ప్రియదర్శనమిమ్ము.

మ. మృగముల్ భీతిఁ గొలంగియుండుపనుల్, హ్రాన్యస్రవంతీలస
న్నగరాజంబుల, దేవతాగృహముల, సన్మౌనిసద్మంబులన్,
జగతిన్ న్యాసముచేయునీ వెటులికిన్, చండాలవేశ్మస్థవై
వగలం బొందెదుగోపుమాడ్కి, మఱెటే పాషండగేహంబులన్?

నా కామె జీవముతో నున్నదన్న యాశ లేదు.

క. నను జూడక తా స్నానం
బొనరింపదు కూడుకుడువ దుదకము ద్రాగన్
జన దట్టి శ్రద్ధ కటకటా!
మనియుండదు నన్నుఁబాసి మహినిమిషంబున్.

అందుచేత శ్రద్ధ లేక శాంతియొక్క జీవనము ముహూర్తకాలమయినను నిరర్థకమైనదే యగును. కాఁబట్టి, ఓసఖీ! కరుణా నీవు నానిమిత్తమయి సౌధ పేర్చుము. అగ్నిహోత్రప్రవేశముచేత నేనచిరకాలములోనే యామె సహచరి నయ్యెదను,

కరుణ — (కన్నీటితో) ఓసఖీ! భయంకరాగ్నిజ్వాలలవంటి కర్ణకఠోరములయిన దుస్సహవాక్యములు పలుకుచు సర్వవిధములచేతను నాప్రాణములుపోవునట్లు చేయుచున్నావు. ఓప్రియసఖీ! కొంతకాంతతవహించి ముహూర్తకాలము జీవము నిలుపుకొమ్ము. ఇంతలో నేనక్కడక్కడ మునిజనసమాకులములయిన పుణ్యాశ్రమములయందును భాగీరథీతీరములయందును నిపుణముగా వెదకెదను. ఒకవేళ మహామోహునివలన భీతిచేతఁ బ్రచ్ఛన్నయయి యామె యెక్కడనయిన దాఁగియుండును.

శాంతి — సఖీ! నీవేల వెదకెదవు?

కరుణ—ప్రియసఖీ! ఊరడిల్లుము. నామమాత్రముచేత నే నిట్లు భయపడ లేదు. పాషండబౌద్ధ సహితము [illegible] యున్నదని యూహించుటవలన నేను మున్ను విన్నదానను. కాబట్టియిది యదార్థమే శ్రద్ధయయి యుండును.

శాంతి—(ఊరడిల్లి) సఖీ! అవును. ఇది యుక్తే. ఎట్లన—

క. భూరిదురాచార నదా
చారనగాగను, గురూప స్వరూపసుగా
నూరక భ్రమపడి దీనిన్
గూరిమిజననిగ దురాశగొంటిని జుమ్మీ.

కానిమ్ము మనమిప్పుడు బౌద్ధులకడనే శ్రద్ధను వెదకుదము.

(అని శాంతికరుణలు ముందునకు నడుచుచున్నారు.)

[అప్పుడు పుస్తకహస్తుడయి బుద్ధాగముడు భిక్షురూపమున
ప్రవేశించుచున్నాడు.]

బుద్ధా—(ఆలోచించి) ఓయుపాసకులారా!

ఉ. ఇప్పుడు నానానమితి యేమియునంటిమి, ధీపరంపరల్
తప్పక వైగళముల్ విషయతత్త్వమరాగ వివర్జితంబులై;
యప్పటిబుద్ధికల్పితము లయ్యెను, బాహ్యములట్లు తోచుగా
నప్పని రాత్మకంబులు క్షణక్షయశీలములౌ పదార్థముల్.

(కొంచమునడచి మరల శ్లాఘనపూర్వకముగా) ఓహో! భోగమును మోక్షమును కలి యున్న యీబౌద్ధధర్మ మెంత మేలయినది!

చ. చెలువగు మందిరంబుల వసింపగవచ్చు; విలాసినీతతిన్
గలయగవచ్చు; భోజనమొనర్పగవచ్చు నభీష్టవేళలన్;
దలిమ్పుదుశయ్యలందు శయనింపగవచ్చు; గృహాంగణాగ్రలై
వలచుప్రియాళితో గడపవచ్చును రాత్రులు పండువెన్నెలన్.

కరుణ—సఖీ! కాషాయవస్త్రము మీదినుండి దిగవ్రేలగా, అంటగొరిగిన తలకాయమీది జుట్టుపిలక యల్లలలాడగా; పొడుగుగా ప్రాటిచెట్టువలె నిల్వబడి తరుణవయస్కుడీవంకను వచ్చుచున్నాడు. అతడెవడు?

శాంతి—సఖీ! వాడు బుద్ధాగముడు.

బుద్ధా—(ఆకాశమునందు) ఓయుపాసకులారా! ఓభిక్షులారా! ధర్మకం... లైన బుద్ధునియొక్క వాక్యామృతమును వినుడు. (పుస్తకమును జూచి చదు

చున్నాఁడు.) ఆకాశమునందు లోకములను సుగతియు ఊర్ధ్వగతియు దివ్యచక్షుస్సుచేతఁ జూచుచున్నాఁడు. సమస్తసంస్కారములును క్షణికములు; ఆత్మనిత్యముకాదు. కాఁబట్టి మీభార్యల నాక్రమించెడు భిక్షువులయెడ మీ రీర్ష్యను బొందఁగూడదు. ఈర్ష్యయే చిత్తమలము." (తొంగిచూచి) ఓశ్రద్ధా! ఇటురమ్ము.

శ్రద్ధ—(ప్రవేశించి) రాజబంధులవారి యాజ్ఞయేమి?

బుద్ధా—ఉపాసకులను భిక్షులను నీవు విడవక యాలింగనము చేసికొనుచుండుము.

శ్రద్ధ—దేవరయాజ్ఞాపించినట్లు చేసెదను. (అని నిష్క్రమించుచున్నది.)

శాంతి—సఖీ! ఈమెయుఁ దామసీశ్రద్ధయే.

కరు—అవును. అట్టిదే.

దిగంబ—(బౌద్ధుని జూచి పెద్దగొంతుతో) ఓరీ! భిక్షుకా! ఇటురమ్ము. నిన్ను నేనొక్కప్రశ్న యడుగఁదలఁచెను.

బుద్ధా—(కోపముతో) ఓరీ! పాపపిశాచా! అట్లరచెద వేమిరా?

దిగం—ఓరీ! కోపము మానుము. నేనొక్క శాస్త్రవిషయము నడిగెదను.

బుద్ధా—ఓక్షపణకా! నీవు శాస్త్రకథనము నెఱుఁగుదువా? కానిమ్ము. (సమీపమునకుఁ బోయి) ఏమి యడిగెదవు?

దిగం—క్షణికవాదివైన నీ వెవరినిమిత్త మీవ్రతమును బూనితివో నాకుఁ జెప్పుము.

బుద్ధా—ఓరీ! వినుము. మాసిద్ధాంతము ననుసరించినవాఁ డొకానొకఁడు క్షణిక విజ్ఞాన మొంది వాసనాబంధములను దెగఁగోసి ముక్తుఁడగును.

దిగం—ఓరిమూర్ఖా! ఏదో మన్వంతరమునం దెవ్వఁడో ముక్తుఁడయ్యెడు పక్షమున, ఇప్పుడే నశించెడు నీ కందువలన నేమియుపకారము గాఁగలదు? ఇంకొక ప్రశ్న నడిగెదను. నీకిటువంటిధర్మము నుపదేశించినవాఁ డెవ్వఁడు?

బుద్ధా—ఈధర్మము సర్వజ్ఞుఁడయిన బుద్ధదేవునిచే నుపదేశింపఁబడినది.

దిగం—ఓరీ! బుద్ధుఁడు సర్వజ్ఞుఁడని నీ కెట్లు తెలిసినది?

బుద్ధా—ఓయీ! బుద్ధుఁడు సర్వజ్ఞుఁడని మాబుద్ధాగమములవలననే ప్రసిద్ధము.

దిగం—ఓరిబుద్ధిహీనుఁడా! అతని మాటలవలననే సర్వజ్ఞత్వము సిద్ధించెడు పక్షమున, అప్పుడు నేనును సర్వజ్ఞుఁడనే. నీపితృపితామహప్రభృతి త్రిసప్తపురుషులతోడఁ గూడ నీవు నాకు దాసుఁడవని నాకును దెలిసినది.

బుద్ధా—ఓరి పాపపిశాచమా! మలపంకధరా! నేనెట్లు నీకు దాసుఁడనురా?

దిగం—ఓరి దాస్యాభుజంగా! ఓదుష్టభిక్షుకా! ఇదినీ కొక దృష్టాంతముగాఁ జెప్పితినిరా. ఇఁక నీకు విశ్వసింపఁ దగినట్టి వాక్యమొకటి చెప్పెదను. ఇఁక నీవు నీ

మతము విడిచి మాయార్హతశాసనము నవలంబించి దిగంబరవ్రతమును ధరించితివి.

బుద్ధా—ఓరి పాపుఁడా! నీవు పాపాత్ముఁడవటులయేకాక ఋషులకుఁగూడఁ గీడు చేయఁ జూచుచున్నావా?

క. పావనసత్పౌరోత్రయము
భావింప ననింద్య మద్ది వర్జించి వెసన్
నీవలెను దిశాంబరత్వము
నీవసుధను లోకనింద్య మెవ్వఁడు కోరున్?

యీయార్హతమతధర్మ మెవ్వఁ డవలంబించును?

దిగం—గ్రహనక్షత్రచారచంద్రసూర్యోపరాగశుక్రోహంపరమార్థజ్ఞానసంవాద శాస్త్రముచేతనే భగవంతుఁడయిన మాయార్హగుని సర్వజ్ఞత్వము నిరూపితమైనది.

బుద్ధా—(నవ్వి) అనాదిసిద్ధమయిన జ్యోతిశ్శాస్త్రమువలని యింద్రియాగోచర జ్ఞానముచేత మోసపోయి నీవీయతికష్టవ్రతము నాశ్రయించుచున్నావు.

చ. పరిమితమైన దేహమునఁ బాయక లోపలనుండు జీవుఁడే
సరణి నెఱుంగ నేరుచు నసంగతిమై భువనత్రయంబు గాంచఁగన్?
కరము జ్వలించుచున్న, ఘటగర్భమునందిడినట్టిదీప మే
కరణిని జూపనోపు గృహగర్భమునం గలవస్తుసంతతిన్?

కాఁబట్టి లోకవ్యయవిరుద్ధమయిన యార్హతమతమునకంటె బుద్ధమతమే శ్రేష్ఠమయినది గాను, కేవలసుఖావహమయినది గాను, మిక్కిలి రమణీయమయినది గాను, నాదృష్టికి గోచరమగుచున్నది.

శాంతి—సఖీ! మనము మఱియొకచోటికిఁ బోవుదము.

కరుణ—ఆలాగుననే చేయుదము. (అని ముందుకు నడుచుచున్నారు.)

శాంతి—(ముందువంకఁ జూచి) మనయెదుర నున్నయీపురుషుఁడు సోమసిద్ధాంతుఁడు. కానిమ్ము. మనమక్కడకుఁగూడఁ బోవుదము.

[అప్పుడు కాపాలికరూపధారియయిన సోమసిద్ధాంతుఁడు
ప్రవేశించుచున్నాఁడు]

సోమ—(ముందుకు నడిచి)

మ. సముదారోగ్రనరాస్థిమాలికలు భూషల్ గా, శ్మశానంబె వి
శ్రమవాసస్థలి గాఁగ భోజనపుఁబాత్రల్ పుఱ్ఱెలై యొప్ప, ని
త్యము యోగాంజనశుద్ధదృష్టి మెయి భేదర్శింతు నన్యోన్యభి
న్నములీలోకము, లీశుకంటె నవిభిన్నంబుల్ గదా యంచెదన్

దిగం... ఓహో! ఈపురుషుఁడు కాపాలికవ్రతమును ధరించుచున్నాఁడు, ఈతని గూడ శాస్త్రప్రశ్న యడిగెదను. (సమీపించి) ఓరీ! కాపాలికా! నరాస్థికపాలధారీ! నీధర్మ మెట్టువంటిది? నీమోక్ష మెట్టువంటిది?

సోమ—ఓరీ! క్షపణకా! ఇప్పుడు నాధర్మమును శ్రద్ధతో వినుము.

శా. మస్తిష్కాక్తవసాభిఘారితమహామాంసంబు వేల్తున్ శిఖిన్;
శస్త్రబ్రహ్మకపాలపూరితసురన్ సద్భక్తి సేవింపుదున్;
ప్రస్తుత్యగ్రనికృత్తకంఠవిగళద్రక్తోగ్రధారాతతిన్
హస్తద్వంద్వకృతోపహార మిడి నేనర్చింతు నాభైరవున్.

బుద్ధా—(చెవులుమూసుకొని) కటకటా! ఈధర్మచర్యమహాదారుణముకదా!

దిగం—అర్హత! అర్హత! ఘోరపాపకారియెవ్వఁడో యీబుద్ధిహీనుని వంచించెను.

సోమ—(కోపముతో) ఓరీ! పాపాత్మా! పాషండాధమా! బోడీ! చండాలా! కేశోల్లుంచకా! చతుర్దశభువనోత్పత్తిస్థితిప్రళయ ప్రవర్తకుండును వేదాంతసిద్ధాంతప్రసిద్ధప్రభావుండును భగవంతుండునునగు భవానీవల్లభుండు వంచకుఁడురా? ఆయన ధర్మమహిమను నేనిప్పుడు కనఁబఱిచెదను.

చ. హరిరుద్రాబ్జభవాది నిర్జరసమూహంబెల్ల రావించెదన్;
సరిగా మింటఁజరించు తారకలసంచారంబు నేనిల్పెదన్;
బురశైలాదులతోడ నిమ్మహి పయఃపూర్ణంబుగావించి యా
పరతోయంబును ద్రావెదన్ క్షణములో భాండంబుల న్సర్వమున్.

దిగం—ఓరీ! కాపాలికా! నేనిందుచేతనే నిన్నెవ్వఁడో యైంద్రజాలికుఁడు మాయలుచూపి మోసముచేసెనని చెప్పియున్నాను.

సోమ—ఓరిపాపీ! పరమేశ్వరుఁ డైంద్రజాలికుఁడని యింకను నాక్షేపించుచున్నావా? వీనిదుష్టత్వము కోపోద్రేకము కలిగించుచున్నది. (కత్తి యొరనుండితీసి)

ఉ. ఈనిశితోగ్రఖడ్గవినికృత్తభవద్గళనాళికోచ్ఛలత్
ఫేనిలబుద్బుదాఘయుతభీకరశోణితభూరిధారలన్
నేనిదె తృప్తిచేసెద వినిశ్చలభక్తిని దుర్గ కిష్టక్రీ
డానినదోల్లసడ్డమరుఘాంకరణాగతభూతవర్గకున్.

(అని కత్తి పైకెత్తుచున్నాఁడు.)

దిగం—(భయముతో) ఓమహానుభావా! అహింస పరమధర్మము సుమా. (అని బుద్ధాగముని మఱుఁగు చొచ్చుచున్నాఁడు.)

బుద్ధా—(సోమసిద్ధాంతుని వారించుచు) ఓమహానుభావా! విమూఢార్థముగాఁ జరపఁబడినయీవాక్యములయందునుబట్టి యీతాపసుని గొట్టుట యుక్తముకాదు.

సోమ—(ఖడ్గము నొరలో వేయుచున్నాఁడు.)

దిగం—(ఊఱటనొంది) ఓమహానుభావా! ఇప్పుడు మీయుద్భవిల్లిన ఘోరకోపము శాంతిపొందినపక్షమున, నేను మిమ్ముఁగొన్నిప్రశ్నలడుగఁదలఁచియున్నాను.

సోమ—అడుగు. అడుగు.

దిగం—మీయుత్తమధర్మమును నేను విన్నాఁడను. ఇఁక మీ మోక్షమెట్టిదో చెప్పుఁడు.

సోమ—వినుము—

మ. తమి నేరెన్ విషయానుభోగములచేఁ దక్కన్ సుఖంబందిరే?
యమలానందవిమూఢజీవదశయే యామోక్షమౌనేని, ధీ
భ్రమతో కవ్వఁడు కోరి వేఁడుకొనుఁ దత్పాషాణముక్తిం గనన్?
ప్రమదాళిన్ సతిఁగాఁగఁ దన్నుశివుఁగా భావించి యాలింగనం
బమరం జేసి సుఖింప ముక్తియగుసం చాశర్వుఁడాడెంజుమీ.

శాంతి—పాపము శాంతిల్లును గాక! పాపము శాంతిల్లునుగాక! భగవంతుఁడ యినభవానీపతి యిటువంటిశాస్త్రమునకుఁ దా నెప్పుడయినను కర్తయగునా? ఇది యెవ్వరో దురాత్ములు కల్పించిరి.

బుద్ధా—ఓమహానుభావా! రాగరహితులు కానివారికి ముక్తికలుగునన్నఁ— మాట యాదరణీయము కాదు.

దిగం—ఓయీ! కాపాలికా! నీకుఁ గోపమురానిపక్షమున నేనొక్కమాట చెప్పెదను. రాగయుక్తుఁడయిన దేహధారి ముక్తుఁడగుననుట వేదవిరుద్ధము.

సోమ—(తనలో)అయ్యో! వీరిమనస్సులు శ్రద్ధారాహిత్యముచేతఁ జెడియున్నవి. కానిమ్ము. (తెరవంకఁజూచి ప్రకాశముగా) ఓశ్రద్ధా! ఇటురమ్ము.

[అప్పుడు కాపాలినీరూప ధారిణియైన శ్రద్ధ ప్రవేశించుచున్నది.]

కరుణ—సఖీ! చూడు. రజస్సుయొక్క కూఁతురైన యీశ్రద్ధనుజూడు. ఈమె—

చ. విరిసిననల్లగల్వలను వీఁకయడంచువిలోలనేత్రముల్,
వరవిమలాస్థినిర్మితకనత్కమనీయవిభూషణావళుల్,
గురుజఘనస్తనాతిభరకుంఠితకోమలమందయానముల్,
సురుచిరపూర్ణచంద్రనిభసుందరవక్త్రము నొప్ప నొప్పెడున్.

శ్రద్ధ—(ముందుకువచ్చి) ఇదిగోవచ్చినదానను. స్వామీ! ఏమియాజ్ఞ

సోమ — ప్రియురాలా! దురభిమానియైన యీభిక్షుని ముందఱ గాఁగిలించుకొమ్ము.

శ్రద్ధ—(బుద్ధాగముని నాలింగనము చేసికొనుచున్నది.)

బుద్ధా—(సంతోషముతో నాలింగనము చేసికొని యొడలు గగుర్పొడువఁగా జనాంతికముగా) ఓహో! ఏమి యీకాపాలినీస్పర్శ!

చ. ఖండతరానురాగమునఁ జన్నుల పొంకము లొత్తి పల్వురన్
రండలఁ గౌఁగిలించితి ఘనస్తనభారలఁ బ్రోల్లి; యెందు నీ
చండికచోరమగ్నాభవసౌఖ్యముతో సరిగాన నందు నే
రండిక నూఱుసార్లు శపథంబులు చేసెద బుద్ధుతోడుగన్.

ఓహో! కాపాలికచరిత మెంతపుణ్యప్రసమమైనది! ఓహో! సోమసిద్ధాంత మెంత శ్లాఘ్యమయినది! ఈధర్మ మాశ్చర్యకరమైనది. ఓమహానుభావా సర్వవిధములచేతను నేను బుద్ధానుశాసనమును విడిచి నీపరమేశ్వరసిద్ధాంతమునందుఁ బ్రవేశించెదను. ఇప్పుడు నీవాచార్యుఁడవు; నేను శిష్యుఁడను. కాఁబట్టి నన్నిప్పుడే పారమేశ్వరదీక్ష యందుఁ బ్రవేశపెట్టుము.

దిగం—ఓరీ! భిక్షుకా! నీవు కాపాలినీస్పర్శనముచేత మయిలపడినాఁడవు. కాఁబట్టి దూరముగా నుండుము.

బుద్ధా—ఓరిపాపాత్మ! కాపాలినియొక్క పరిరంభణమహోత్సవముఁ గానక నీవెంతవఱకును వంచితుఁడవయితివి.

సోమ—ఓప్రియురాలా! నీవిప్పుడు దిగంబరునిగూడ నాలింగనము చేసికొమ్ము.

శ్రద్ధ—(దిగంబరసిద్ధాంతునిఁ గౌఁగిలించుకొనుచున్నది.)

దిగం—(గగుర్పాటుతో) ఓహో! అర్హంత! అర్హంత! ఓహో! ఏమి యీ కాపాలినీసుఖస్పర్శనము! ఓసుందరీ! నీవింకొకసారి నన్ను మరలఁ గౌఁగిటఁ జేర్చుము. (తనలో) ఔరా! నే నిప్పుడు మహత్తరమయిన యొక యింద్రియవికారమునకు లోఁబడినాఁడను! ఇఁక నేమి యుపాయము? ఇప్పుడేది యుక్తము? కానిమ్ము. ఇప్పుడీ పింఛికంథము కప్పుకొనెదను. (అని యట్లు చేయుచున్నాఁడు.)

క. ఓపీనఘనస్తని! ఓ
కాపాలిని! భీతహరిణకమనీయాక్షీ!
మాపటి నీవు రమించిన,
పాపము సేయఁగలదేది యాశ్రావకిచేన్!

ఓహో! కాపాలికశాస్త్ర మొక్కటియే భోగమోక్షసాధనము! ఓయాచార్యా నేను

నిప్పుడు నీదాసుఁడ నయితినఁటను. నన్నుఁ గూడ శ్రీమహాభైరవానుశాసనమునందు దీక్షితుని జేయుము.

సోమ—కూరుచుండుము.

ఇద్దఱు—(కూరుచున్నారు.)

సోమ—(పాత్రము చేతఁబట్టుకొని ధ్యానము నభినయించుచున్నాఁడు.)

శ్రద్ధ—ఓదేవా! ఈపాత్రము సురాపూరితమయినది.

సోమ—(చూచి తానుఁగొంత త్రాగి మిగిలినదానిని బుద్ధాగమ దిగంబర సిద్ధాంతుల కిచ్చుచున్నాఁడు.)

క. ఇది పావన మిది యమృతం
బిది యఘరోగాపహ మిది యాశ్వాసఘటితం
బిది భవపాశచ్ఛేదక
మిది యాస్వాదింపుఁ డిపుడు తృప్తిగ వీరల్.

ఇద్దఱు—(ఆలోచించుకొనుచున్నారు.)

దిగం—మా కార్హతశాసనమును బట్టి మద్యపానము కూడదు.

బుద్ధా—కాపాలికుఁ డెంగిలి చేసిన కల్లు నే నెట్లు త్రాగఁగలను.

సోమ—(ఆలోచించి జనాంతికముగా) ఓశ్రద్ధా! నీవాలోచించుచున్నావేమి? పశుత్వ మిప్పుడును వీరిని విడువలేదు. నావదన సంస్పర్శదోషమువలన సుర యపవిత్రమయినదని వీ రెంచుకొనుచున్నారు. కాఁబట్టి, ఓపూజ్యురాలా! నీవక్త్రాసవముచేత దీనిని శుద్ధిచేసి వీరి కిమ్ము. స్త్రీలనోరు సదా శుచియని త్రైర్థికులు సహితము చెప్పుచున్నారు.

శ్రద్ధ—దేవరవారాజ్ఞాపించినట్లు చేసెదను. (అని పానపాత్రము పుచ్చుకొని తాను గొంత త్రాగి మిగిలినదానిని వారిదాపునఁ బెట్టుచున్నది.)

బుద్ధా—ఇది మహాప్రసాదము. అనిపానపాత్రమందుకొని త్రాగుచున్నాఁడు. ఆహా! ఏమి యీసురయొక్క సువాసన!

చ. సకియలపొత్తునన్ వెనుకఁ జక్కఁగ నెన్నియొసార్లు గ్రోలలే
వకుళసువాసనా మధురవారసతీవదనాసవంబు? ని
య్యకలుషసుందరీముఖమహాసవ మానరు గాక దేవతల్,
ప్రకటసుధారసంబు పయి వాంఛ యొనర్తురె దీనిఁ గ్రోలినన్?

దిగం—ఓరీ! భిక్షుకా! అంతయు నీవే త్రాగకు. కాపాలినీ వదనోచ్ఛిష్టమయిన యీమద్యమును నాకుఁగూడఁ గొంత యిమ్ము.

బుద్ధా—(పానపాత్రము దిగంబర సిద్ధాంతుని కందించుచున్నాఁడు.)

దిగం—(త్రాగి) ఓహో? ఏమి యీమద్యముయొక్క మాధుర్యము! ఏమి రుచి! ఏమిగంధము! ఏమి పరిమళము! అర్హచ్ఛాసనములోఁబడి చిరకాల మిటువంటి సురారసములేక మోసపోతిని. ఓభిక్షుకా! నా యంగములు తిరుగుచున్నవి. నేను శయనించెదను.

బుద్ధా—అటుచేయుము. (ఇద్దఱును బరుండినారు.)

సోమ—ఓప్రియురాలా! మనకిప్పుడు వెలలేక యిద్దఱు దాసులు లభించినారు. కాఁబట్టి మనము నృత్యము చేయుదము. (ఇద్దఱు నృత్యము చేయుచున్నారు.)

దిగం—ఓభిక్షుకా! ఈ కాపాలికుఁడు—కాదు కాదు—ఈయాచార్యుఁడు కాపాలినితోఁగూడ మంగళనృత్యము చేయుచున్నాఁడు. కాఁబట్టి వీరితో మనముకూడ నృత్యము చేయుదము.

బుద్ధా—ఆలాగుననే చేయుదము. (అని మదముచేతసోలుచు నృత్యము చేయుచున్నారు.)

దిగం—క. "ఓపీనఘనస్తని! ఓ
కాపాలిని! భీతహరిణశమనీయాక్షీ!
మాపటి కీవు రమించిన,
నాపయిఁ జేయఁగలదేది యాశ్రావకిచేన్?"

(అని పాడుచున్నాఁడు.)

బుద్ధా—ఆచార్యా! ఈశాస్త్రము మత్యద్భుతమయినది! ఇక్కష్టపడనక్కఱలేకయే యభిమతార్థసిద్ధులు సంపాద్యములగుచున్నవి.

సోమ—ఇది యెంత యాశ్చర్యము! చూడు—

మ. తనియంబొందుదు రిప్సితార్థ విషయత్యాగంబు లేకీమతం
బున మోక్షప్రియు లష్టసిద్ధులఁ గరంబున్; యోగవిఘ్నంబులై
యునికిం బ్రాకృతమంత్రసిద్ధులను వశ్యోచ్చాటనాకర్షణామో
హనసంక్షోభణమారణాదులఁ దృణంబట్లెంచు రత్యంతమున్.

దిగం—ఓయీ! కాపాలికా! (ఆలోచించి) ఓరియాచార్యా! ఓరాజబాంధవా!! (అని తూలుచుఁ దిరుగుచున్నాఁడు.)

బుద్ధా—మున్ను లవాటుపడినవాఁడగుటచేత నీతపస్వి మధుపానాధిక్యమువలన మిక్కిలి మత్తెక్కియున్నాఁడు. కాఁబట్టి యిప్పుడితనిమత్తు పోవుపని చేయవలెను.

సోమ—ఆలాగుననే చేయుదము. (అనితననోటిలోనితమ్మ దిగంబరసిద్ధాంతునికి

నోటలోఁ బెట్టుచున్నాఁడు.)

దిగం—(స్పష్టుఁడయి) ఓయాచార్యా! నిన్నొకటడుగుచున్నాను. కోటీశ్వరుఁడు సురలోకమునందున్న శక్తి స్త్రీపురుషుల నాకర్షించు మాటలోఁ గూడఁ గలఁడా?

సోమ—ఇది యేమిగొప్పయని యడుగుచున్నావు? చూడు—

మ. వరవిద్యాధరకాంతలన్ సురసతీవారంబు, నాగేంద్ర సుం
దరులన్, యక్షవిలాసినీమణుల, యుద్యోంభానుసారంబుగా
మరి యెవ్వారలనైన, నుజ్జగమునన్ మద్గోత్రప్యశంక్లాఘ్యాదు
ష్కరవిద్యాబల గౌరవంబున సమాకర్షింపఁగాఁ జాలుదున్.

దిగం—ఓయీ! మనమందరమును మహామోహుని కింకరుల మని యిప్పుడు నేను గణితముచేతఁ దెలిసికొన్నాఁడను.

ఇద్దఱు—నీవు దెలిసికొన్న దంతయు సత్యమే.

దిగం—అట్లయిన యెడల మనమిప్పుడు రాజకార్యమొకటియాలోచింపవలెను.

సోమ—అది యేది?

దిగం—సత్త్వపుత్త్రికయైన శ్రద్ధను రాజుగారి యాజ్ఞాప్రకారముగా మనము పట్టి తేవలెను.

సోమ—అతో తొందరపడక యెక్కడనున్నదో నాకుఁ జెప్పుము. నేను వెంటనే దానిని నావిద్యాబలముచేత నాకర్షించి తెప్పించెదను.

దిగం—నేనిప్పుడు లెక్కవేసి నీకుఁ జూపెదను. (అని బలపము పుచ్చుకొని భూమిమీఁద స్థానములు వేసి గణించుచున్నాఁడు.)

శాంతి—సఖీ! ఇప్పుడు హాతాసులయున వీరిమాటలు నాతల్లి నిగూర్చినవైనట్టు వినఁబడుచున్నవి. మనము సావధానముగా విందము.

కరుణ—సఖీ! ఆలాగుననే చేయుదము. (అని యిద్దఱు నాలకించుచున్నారు.)

దిగం—గీ. జలమునను లేదు; లే దెందు స్థలమునందు!
శైలములలేదు; లేదు పాతాళమందు;
శ్రద్ధ యయ్యది హరిభక్తి సహితయగుచు
నున్న దిపుడు మహాత్ముల యుల్లములను.

కరుణ—(ఆనందముతో) సఖీ! నీవు భాగ్యశాలినివి. శ్రద్ధాదిష్ట భక్తి దేవియొక్క పార్శ్వవర్తినియయియున్నది.

శాంతి—(హర్షము నటించుచున్నది.)

బుద్ధా—మతి కామునివిడిపోయిన ధర్మఁ డెక్కడనున్నాఁడు?

దిగం—(మరల నంగెలు గణించి)

గీ. జలమునను లేఁడు; లేఁడెంను స్థలమునందు;
శైలముల లేఁడు; లేఁడు పాతాళమందు;
విష్ణుభక్తితో ధర్ముఁడు వేడ్కఁగూడి;
యున్నవాఁడు మహాత్ముల యుల్లములను.

సోమ—(విషాదముతో) అక్కటా! మనమహారాజునకు గొప్పకష్టమువచ్చినది.

చ. తలఁపఁగ విష్ణుభక్తియె నిదానము శాశ్వతహర్షసిద్ధికిన్;
గలసెను దానితో నపుడు క్రిన్నన సత్త్వము మారిశ్రద్ధయున్;
తెలియఁగ కాముని న్విడిచి చేరెను ధర్ముఁడుగూడ నచ్చటన్;
దలఁతు వివేకకార్య మిఁకఁ దద్దయు సిద్ధినిబొందినట్లుగన్.

అయినను మనము ప్రాణాంతోపద్రవము వచ్చినను వెనుకతీయక స్వామికార్యమును చేయవలెను. ఇప్పుడు ధర్మశ్రద్ధలను బట్టితెచ్చుటకయి మహాభైరవీవిద్యను బంపుచేసెదను. (అని ముగ్గురును నిష్క్రమించుచున్నారు.)

శాంతి—సఖీ! ఇప్పుడు మనమును హతాశు లయినవీరి దుర్వ్యవసాయమును దేవియైనవిష్ణుభక్తికి నివేదింతము. రమ్ము.

(అని నిష్క్రమించుచున్నారు.)

## చతుర్థాంకము.

[అప్పుడు మైత్రి ప్రవేశించుచున్నది.]

మైత్రి—మహాభైరవియొక్కవాతఁ బడకుండ ధర్మునితోఁగూడ నాప్రియసఖియైనశ్రద్ధను విష్ణుభక్తి కాపాడెనని ముదితవలన నేను విన్నదానను. కాఁబట్టి యీ తహతహ పడుచున్నమనస్సుతో నాప్రియసఖినెక్కడఁ జూడఁ గలుగుదును?

(అని ముందుకు నడుచుచున్నది.)

[అంతట శ్రద్ధ ప్రవేశించుచున్నది.]

శ్రద్ధ—(నాలుగు దిక్కులనుజూచి భయోత్కంపముతో)

మ. వెనుకన్, మర్త్యకపాలకుండలవతిన్, విద్యుచ్ఛటావిక్షిప
ద్ఘనదృష్టిన్, శిఖికీలికారుణకచాత్యంతోగ్రి, భాలేందుర
శ్మినిభోద్యత్క్షురదంష్ట్రికాంతరచలజ్జిహ్వన్, మహాభైరవిన్
గనుచున్నట్లు వడంకుఁ జిత్తమిపుడున్ రంభాదళప్రక్రియన్.

మైత్రి—(తనలో) అయ్యో! నాప్రియసఖియైనశ్రద్ధాదేవి భయసంభ్రమోద్భ్రాంతహృదయ యయి గాలిచేఁగదలుచున్న కదళీతరుప్రకాండమువలెఁ గంపమొందుచున్నయంగములతోఁదనలోఁ దానేదో యాలోచించుకొనుచు, దాపునకు వచ్చినను నన్నుఁజూడకున్నది. కాఁబట్టి నేనేయీమెను బలుకరించెదను. (ప్రకాశముగా) ఓప్రియసఖీ!శ్రద్ధా! ఇదేమి? నీవుమనస్తాపముచేత నన్నుసహితము చూడకున్నావు?

శ్రద్ధ—(చూచి నిట్టూర్పుతో) ఓప్రియసఖీ! మైత్రీ!

చెలి? కాళరాత్రినాఁటను
బలుకోలలనడుమఁ జిక్కి ప్రాణముతోడన్
వెలువడుచు నేను గనుఁగొనఁ
గలిగితి నీజన్మమందె క్రమ్మఱ నిన్నున్.

కాఁబట్టి నీవు దగ్గఱగావచ్చి నన్నుఁ గౌఁగిలించుకొమ్ము.

మైత్రి—(ఆలింగనముచేసికొని) సఖీ! అట్లు విష్ణుభక్తి మహాభైరవియొక్క ప్రభావము నడఁచివేసినను, నీయంగము లింకను గంపమొందుచున్న వేమి?

శ్రద్ధ—మ. వెనుకన్, మస్తకపాలకుండలవతిన్, విద్యుచ్ఛటావిస్ఫుర
ద్ఘనదృష్టిన్, శిఖికీలికారుణకచాత్యంతోగ్ర, బాలేందుర
శ్మినిభోద్యత్ఖరదంష్ట్రికాంతరచలజ్జిహ్వన్, మహాభైరవిన్
గనుచున్నట్లు వడంకుఁ జిత్తమిపుడున్ రంభాదళప్రక్రియన్.

(అని మరలఁ వణఁకుచున్నది.)

మైత్రి—(భయముతో) హా! నాతోడురాలయిన యామె ఘోరరూపము కలదిగదా? ఆప్రకారముగావచ్చి యామె యేమిచేసినది?

శ్రద్ధ—సఖీ! వినుము—

చ. ధరణికి డేగడిగ్గెడువిధంబున భైరవి డిగ్గి, నన్ను దు
ర్భరచరణద్వయిం బొదివి, వామకరంబున ధమ్మఁ బట్టి, యం
బరమున కేగవేఁగఁ, బెనుమాంసపుముద్దలు లెంకు గృధ్రభీ
కరనఖరాగ్రకోటినిడి గ్రక్కున నింగికిఁ బాఱుకైవడిన్.

మైత్రి—అయ్యో!అయ్యో! (అని మూర్ఛిల్లుచున్నది.)

శ్రద్ధ—సఖీ! ఊరడిల్లుము.

మైత్రి—(తెలివి తెచ్చుకొని) తరువాత. తరువాత.

శ్రద్ధ—తరువాత నాయార్తనాదమువలన దయార్ద్రహృదయుండై—

మ. శార్ఙ్గధ్వంసము విష్ణుభక్తి యచటన్ ధూర్తాంగకౌటిల్యభీ
కరమున్ నిర్భరకోపపాటలము నా కంటన్విలోకింపఁగా,
ధరణిం గూలెను, వజ్రపాతహతిచేతన్ భూమిపైఁ ద్రెళ్లు సు
స్థిరభూభృచ్ఛిఖరంబులట్లు, భైరవి శిరోస్థిస్రాతముల్ నుగ్గుగాన్.

మైత్రి—ప్రియసఖీ! దైవవశముచేతఁ బులినోటఁ బడి వెలువడినకురంగాంగన వలెనే నీవును నీభాగ్యముచేతఁ బ్రతుకఁగంటివి. తరువాత. తరువాత.

శ్రద్ధ—తరువాత విష్ణుభక్తిదేవి "నన్ను సహిత మవమానింపఁ బ్రవర్తించుచున్న దురాత్ముఁ డయిన యీ మహామోహప్రేతమును నేను సమూలముగా నిర్మూలము చేసెదను" అని కోపావేశముతోఁ బలికి, నావంకఁ జూచి "ఓ శ్రద్ధా! నీవుపోయి వివేకునితో నిట్లు చెప్పుము.—నీవు కామక్రోధాదులను నిర్జించుటకయి ప్రయత్నింపుము. అప్పుడు వైరాగ్యోదయము తప్పక కలుగును. నేనును సమయము వేచి ప్రాణాయామాదుల కుత్సాహము పుట్టించి నీ సైన్యము ననుగ్రహించెదను. ఋతంభరాది దేవులు శాంత్యాదుల కౌశలముచేత నుపనిషద్దేవీసంగమమువలనఁ బ్రహ్మజ్ఞుఁడ వయిన నీకుఁ బ్రబోధచంద్రుఁ డుదయించు సాధనమును జేయుదురు." అని సెలవిచ్చినది. కాఁబట్టి నేనిప్పుడు వివేకుని సన్నిధికిఁ బోవుచున్నాను. ఇప్పుడు నీ వేపనిమీఁద దినములు పుచ్చుచున్నావు?

మైత్రి—అక్కచెల్లెండ్రము మేము నలువురమును విష్ణుభక్తియొక్క యాజ్ఞచేత వివేకుని కార్యసిద్ధికొఱకు మహాత్ముల యాత్మలయందు నివసించెదము.

చ. నను సుఖజీవులందుఁ, గరుణన్ ఘనదుఃఖితులందుఁ, బుణ్యకా
ర్యనిరతులందు నమ్ముదిత, భ్రష్టకుబుద్ధులయం దుపేక్ష, వా
రనుపఁదలంత్రు; మేము దటనుండుట నాత్మలు రాగలోభము
ఖ్యఖిలదోషదూషితము లయ్యును గాంచును నిర్మలత్వమున్.

కాఁబట్టి యీవిధముగాఁ దోబుట్టువులమైన మేము నలువురమును వివేకాభ్యుదయము కొఱకై నవ్యాపారము చేత వాసరములు గడపుచున్నాము. ఓ ప్రియసఖీ! నీవిప్పు డెక్కడ వివేకమహారాజును గనుఁగొనఁగలవు?

శ్రద్ధ—"రాధాదేశమని యొకటియున్నది. అక్కడ భాగీరథీసమీపప్రదేశమున నలంకారభూతమయిన చక్రతీర్థమునందు మీమాంసానుగతయైన మతిదేవితోఁడఁ గూడ దీర్ఘప్రాణములు నిలుపుకొని వ్యాకులహృదయముతో నుపనిషద్దేవీసంగమార్థముగా వివేకుఁ డహర్నిశమును దపము సేయుచున్నాఁడు." అనిదేవియైన విష్ణుభక్తి నాతో సెలవిచ్చినది.

మైత్రి—ఓప్రియసఖీ! నీవప్పటికిఁబొమ్ము, నేనునువానికిఁజోయెదను.
శ్రద్ధ—అట్లుచేయుము.

(ఇద్దఱును నిష్క్రమించుచున్నారు.)

ఇది విష్కంభము

[అప్పుడు వివేకమహారాజును బ్రతీహారియుఁ బ్రవేశించుచున్నారు.]

వివే—ఓరి మహామోహా! ఓరిదోసకారిపీనుఁగా! ఈమహాజనులెల్ల నీవల్ల సర్వ విధములచేతను జెడిపోయిరి.

శా. జ్ఞానానందము నిస్తరంగము మహాశాంతంబు ప్రోద్యన్మహా
త్స్నానంబు మహామృతాబ్ధిజల మహా! త్రాగ గందుండియున్;
వే నిస్సారమరీచికాజలమునందే మున్గుచుం దేలుచున్
జానస్నానము లాచరించెదరు. విభ్రాంతి న్విమూఢాత్మకుల్.

సంసారచక్రవాహకుఁడై యున్నమహామోహున కజ్ఞానమేమూలము. ఆ యజ్ఞానము తత్త్వబోధమువలననే నివృత్తికాఁగలదు. ఎట్లన—

గీ. అవని నజ్ఞానమూలక మైనయట్టి
వృషులసంసారవృక్షంబు పెల్లగించి
పరముఁ గూర్ప విశ్వేశ్వరోపాసనాఖ్య
బీజజన్యాత్మబోధంబె పెరవుసుమ్మ

తలుముగా మంచివారు పూనినకార్యములకు దేవతలు తోడుపడుదురని తత్త్వవేత్తలు చెప్పుదురు. అందుచేతనే విష్ణుభక్తిదేవియిప్పుడు "నీవుకామాదులను గెలుచుట కుద్యోగింపుము; నేనును నీపక్షము నవలంబించెదను" అని సందేశము పంపినది. అక్కడఁ బ్రధానవీరుఁడైయున్న కాముని వస్తువిచారుఁ డొక్కఁడే జయింపఁదగినవాఁడు. కావున వానిని నిర్జించుటకయి యిప్పుడతనినే నియమించెదను. ఓవేదవతీ! నీవు వస్తువిచారుని బిలుచుకొనిరమ్ము.

ప్రతి—దేవరవా రాజ్ఞాపించినట్లు చేసెదను.

(అని నిష్క్రమించివస్తువిచారునితోడఁగూడఁ బ్రవేశించుచున్నది.)

వస్తు—అయ్యో! నిర్విచారసౌందర్యాభిమానవర్ధిష్ణుఁడైన కామపిశాచునిచేతను ముఖ్యముగా దురాత్ముఁడైనమహామోహునిచేతను లోకము చెడిపోవుచున్నది.

చ. కలికి యటంచునున్, గలువకంటి యటంచును, సుభ్రువంచు, ము
ద్దులసుముఖాబ్జ యంచు, కుచయుగ్మ స్తని యంచు, బృహన్నితంబయ

చెలిమి నుతించుఁ గాంచుఁ గ్రమియించు రమించు భుజించు హా! వి
ద్యా లఘుబుద్ధస్థులందును దలంపఁడు మోహవిచేష్టితంబులన్

అక్కా నావస్తువిచారము చేయఁగల నాత్మబుద్ధులకు పరీతము మాంసాస్థిపంజరము లైన స్త్రీలు స్వభావదుర్గంధనిలయ లనియు బీభత్సవేష లనియు వైరాగ్యముకలుగకున్నది. అట్లయినప్పుడు వారియం దితరగుణారోపణము చేయుట స్పష్టమే.

మ. వరముక్తామణిహారముల్ మణిరణత్స్వర్ణాంగదంబుల్, సితాం
బరచిత్రోరు దుకూలముల్ ఘుసృణపున్నైర్మృపూతలున్ దావిపూ
సరముల్ పైపయిఁ జూచి యల్పమతు లిచ్ఛం గాంత్రు సమ్మోహమున్
ధరనారుల్ వరకార్ధనామలనుచుం దలంతు రజ్ఞస్మృతుల్

(ఆకాశమువంకఁ జూచి) ఓపాపీ! చండాలా! ఓరి కామా! అనావలంబనముగా వచ్చి వీవీలాగున జనులను వ్యాకుల పెట్టుచున్నా వేమిరా? ఓహో! కామావిష్టుఁడు—

మ. ననుఁ గామించెను బాలయా మె, యొలమిన్ నన్నీక్ష్యం గాంకాస్యచూ
చెను, నీలోత్పలనేత్ర కౌఁగిటను జేర్చెన్ న, న్ననున్ గామి; యెవో
ఘునమూర్ఖా! నిను గాంచె నెవ్వతె? నినుం గామించె నెవ్వర్తె యాం
గన మాంసాస్థుల బుంగ; లోపలి నిరాకారుం డె వీక్షించెడున్.

ప్రతీహారి—ఓమహానుభావా! ఇటురమ్ము.

ఇద్దఱు—(ముందుకు నడుచుచున్నారు.)

ప్రతి—అదె మహారాజాసీనుఁడయియున్నాఁడు. నీవాయనసన్నిధికిఁబొమ్ము.

వస్తు—(దాపునకుఁబోయి) దేవా! జయమగుఁగాక! జయమగుఁగాక! వీఁడె వస్తువిచారుఁడు దేవరకుఁ బ్రణమిల్లుచున్నాఁడు.

వివే—వస్తువిచారా! ఇక్కడఁ గూర్చుండుము.

వస్తు—(కూరుచుండి) దేవా! మీ సేవకుఁడు వీఁడె వచ్చియున్నాఁడు. ఆజ్ఞ దేమో యనుగ్రహింపవలెను.

వివే—మహామోహునితో మనకు యుద్ధము సంప్రాప్తమయినది. అక్కడ ప్రధానవీరుఁడు కాముఁడు, వానికిఁ బ్రతివీరునిగా నేము నిన్ను నిరూపించినాము.

వస్తు—దేవరవారు నన్నిట్లు సంభావించుటచేత ధన్యుఁడనయినాఁడను.

వివే—ఇఁక నీ వేయుపాయముచేత గాముని జయించెదవు?

వస్తు—ఓహో! సందేహమేలా! వాని నన్నవిజయిదమ్ములు. పూవిల్తునిగాముని జయించు టెంతపని? ఇక్కడఁ గూడ శస్త్రగ్రహణ మపేక్షింపవలెనా? దేవరవారు చిత్తగింపుఁడు—

బాధ మదీయ దోస్తులకు వల్లక వైరుల, వీరి జోయనన్
సాధులు నిశ్చలాత్మమలసాగరతుల్య గభీరు లెంతయున్!

(శ్లాఘనపూర్వకముగాఁ దన్నుఁ జూచుకొని)

లేదు వచోధిక క్రియయు; లేదు శిరఃపరిపీడనంబునున్;
లేదు మనోపతాపమును; లేదు శరీరవిశుద్ధసంబరాన్;
లే దలపింప యాదిగ గణింపఁగఁగల్గు ననర్థయోగమున్;
బ్రోదిగ నేని తద్దయును క్రోధజయంబున శ్లాఘ్యనయిర్వదిక్

(ఇద్దఱును ముందుకు నడుచుచున్నారు.)

ప్రతీ—అదె మహారాజుగారు, ప్రియసఖీ! ఆయనను సందర్శింపుకొమ్ము.

క్షమ—(సందర్శించి) దేవా! జయమగుఁగాక! జయమగుఁగాక! ఇదిగో దేవర వారి దాసురాలయిన క్షమ సాష్టాంగప్రణామము చేయుచున్నది.

వివే—ఓక్షమా! ఇక్కడఁ గూరుచుండుము.

క్షమ—(కూరుచుండి) దేవా! ఈ సేవకురాలెందునిమిత్తము పిలిపింపఁబడినదో యాజ్ఞయింపుఁడు.

వివే—ఓక్షమా! మాకిప్పుడు సంప్రాప్తమయిన యుద్ధమునందు దురాత్ముఁడయిన క్రోధుని నీవు జయింపవలెను.

క్షమ—దేవరవారి యనుగ్రహము వలన నేను మహామోహునైనను జయించుటకు సమర్థురాలనగుదును. ఇఁక నాతని యనుచరమాత్రుఁడైన క్రోధుఁ డెంత? నేనా పనిని తప్పక నిర్వహించెదను.

ఉ. అన్నిట దేవయజ్ఞ పితృయజ్ఞ తపోధ్యయనక్రియాదు లె
న్నెన్నొ యకారణంబ నమయించెడువానిని బాపకర్మునిన్
గన్నుల నిప్పుకల్ కురయఁ గ్రక్కుచువాని నధీరతుఁ గ్రోధునిన్
మున్న లభద్రకాళి యధమున్ మహిషాసురుఁ జంపినట్లుగన్.

వివే—ఓక్షమా! ఇప్పుడు క్రోధవిజయోపాయము నాకు వినిపింపుము.

క్షమ—దేవా! విన్నవించెదను వినుఁడు.

చ. ప్రియమగు స్నిగ్ధ చాటు సరసోక్తులు, దురాగ్రహముచేఁ బ్రసాదము,
బయనమయ స్ఫూర్తిచేఁ గుశలవార్త, ప్రమోదము తోడనో ప్రణయచో,
నెరపఁగఁ జెల్లుఁ; బొందును రసజ్ఞతచిత్తులు దైవికాపదు
ల్కడమునె! క్రోధశాలి కొలుకుట్ల దయారసమానసంయులే!

వివే—సాధు! సాధు!

శుభ—దేవా! క్రోధుని జయించుటవలననే హింసాపారుష్యమానమాత్సర్యా దులు సహితము జయింపఁబడినవారగుదురు.

వివే—మంచిది. నీవు శత్రు విజయముకొఱకు సంసిద్ధురాలవుకమ్ము.

శుభ—దేవరవారాజ్ఞాపించినట్లు చేసెదను. (అని నిష్క్రమించుచున్నది.)

వివే—వేదవతీ! లోభుని జయించుటకయి సంతోషుని పిలువఁగొనిరమ్ము.

ప్రతీ—దేవర సెలవిచ్చినట్లు చేసెదను. (అనినిష్క్రమించి సంతోషునితోడఁ గూడఁ ప్రవేశించుచున్నది.)

సంతో—(ఆలోచించి జాలితో)

చ. ప్రతివనమందు స్వేచ్ఛముగఁ బండ్లలభించును భూరుహంబులన్;
హితవుగ నెల్లచో దొరకు నేళ్ళను జల్లని స్వాదుతోయముల్;
పతిలతయందుఁ జిక్కు మృదుపల్లవముల్ సుఖశయ్య కౌపుగా;
నతికృపణుల్ శ్రమింపదురు రట్లయియున్ ధనికాంగణంబునన్.

(ఆకాశమువంకఁజూచి) ఓరిమూర్ఖా! లుబ్ధా! నీయీవ్యామోహము దురుచ్ఛేదము గదా?

చ. ధనమృగతృష్ణికాబ్ధిజలధార వృథా దగఁగొన్న నీవు దా
పునఁగనె, యెన్నిసార్లు చెడిపోవఁగలేదు భవత్ప్రియత్నముల్?
మనుజమృగంబ! యాశ నిటు మానవుటయ్యెను; నేఁడునాటిగా
దనుఁగను నీమనంబకనితో శిలతో నదిచేయఁగాఁబడెన్.

లోభాంధకారవాతుఁడవయిన నీయీచేష్టితము మనస్సునకాశ్చర్యము కలిగించుచున్నది. ఎట్లనిన—

మ. ధనమార్జించెదనందుఁ, బ్రాప్తమగు విత్తంబింక హెచ్చింతు నం
చును, లాభంబును వృద్ధిఁగోరిచెద నందున్, సొమ్ము ధ్యానింతు వీ
వనిశంబున్; గన నన్నిటిందినెను యాయాశాపిశాచంబు గ్ర
క్కున లోభాంధతమోవృతున్ నిను మోసంగుణ బల్మినం జిక్కెడా!

మఱియు,

ధనము గడించుచో మొదటఁ దద్దయుఁ గష్టము; కల్గినాపయిన్
ధనరక్షణన్ క్షయంబును వినాశము రెండు వియోగమార్గముల్;
ధనము నశింపఁ గల్గును వ్యథల్; సిరిఁ గూర్పమిఁ గల్గ వాశ్యథల్
ధనమును గూర్చుకొంచుటయె దానినిఁ గూర్పుటె మేలు చెప్పుమా.

ఇంతేకాక,

క. భీకరశోకాగ్నిశిఖా
నీకము శిథిలములోనన్ను నెఱుకుల నెల్లన్
దైకొలుపు దేహశోషముఁ?
బ్రాకటముగ నంతరాత్మ వఱిగ దహించున్

(ఆలోచించి) "బిడ్డా! శ్రద్ధా! నేనిక్కడుండి హింసాప్రధానమైన యుద్ధమును జూడలేను కాఁబట్టి నేనీకాశికాపురమును విడిచి సాలగ్రామమను పేరుగల విష్ణుక్షేత్రమునందుఁ గొంతకాలము గడపెదను. నీవిక్కడనుండి వృత్తాంతమును జరిగిన ప్రకారము నాకు నివేదింపుము" అని విష్ణుభక్తిదేవి నాకాజ్ఞాపించినది కాఁబట్టి యాదేవిసన్నిధానమునకుఁ బోయి యీసమగ్రవృత్తాంతము సర్వమును నేనామెకు విన్నవించెదను (ముందుకు నడిచి చూచి) ఇది యాచక్రతీర్థము. ఇందు సంసారసాగరోత్తారకమయిన నావకుఁ గర్ణధారుఁడైన భగవంతుఁడగు శ్రీహరి ప్రత్యక్షముగా వాసము చేయుచున్నాఁడు (ప్రణమిల్లి) ఇదిగో మునులచే నుపాస్యమానురాలయిన విష్ణుభక్తిదేవి శాంతితో నేదో యాలోచించుచున్నది. నేనామెకు సమీపమునకుఁ బోయెదను (అని ముందు నడుచుచున్నది.)

[అంతట విష్ణుభక్తియు శాంతియుఁ బ్రవేశించుచున్నారు]

శాంతి—అమ్మా! మీరు ప్రబలచింతాకులహృదయ లయి యున్నట్లు కానఁబడుచున్నారు.

విష్ణు—బిడ్డా! మహాభీకరమయినయీ ఘోరయుద్ధమునందు బలవంతుఁడైనమహామోహునితోఁ బ్రతిఘటించి పుత్రప్రాయుఁడైన వివేకునివృత్తాంత మేమయినదో తెలియకపోయెనని నామనస్సు వ్యస్తమగుచున్నది.

శాంతి—దేవీ! ఇక్కడ విచారింపవలసినపని యేమున్నది? దేవిగారియనుగ్రహమున్నందున వివేకమహారాజునకు విజయము నిశ్చయమని నేనెఱుఁగుదును.

విష్ణు—బిడ్డా.

క. ఘనధర్మపక్షబలమున
ననివార్యంబుగ లభించు నభ్యుదయంబుల్?
విను మట్లయ్యును, సుహృదుల
మనసెప్పుడు నపాయశంక మఱిమఱిపూనన్.

అంతేకాక శ్రద్ధ యింతతడవు రాకుండుట మనస్సునకు సందేహము పుట్టించుచున్నది.

శ్రద్ధ—(సమీపమునకుఁబోయి) భగవతీ! ప్రణమిల్లుచున్నాను.

విష్ణు—శ్రద్ధా! నీవు క్షేమముతో వచ్చితివా?

శ్రద్ధ—దేవిగారి యనుగ్రహమువలన.

శాంతి—అమ్మా! ప్రణామము చేయుచున్నాను

శ్రద్ధ—పుత్రీ! నన్నాలింగనము చేసికొమ్ము.

శాంతి—(తల్లిని కౌఁగిలించుకొనుచున్నది)

శ్రద్ధ-బిడ్డా! విష్ణుభక్తి దేవిప్రసాదముచేత మునిజనమనోనివాసమును బొందుము.

విష్ణు—అక్కడ నేమిజరిగినది;

శ్రద్ధ—దేవిగారికిఁ బ్రతికూలముగాఁ బ్రవర్తించువారికిఁ దగినట్లు జరిగినది.

విష్ణు—అది సవిస్తరముగాఁ జెప్పుము.

శ్రద్ధ—దేవీ! అవధరింపుము. దేవి యట్లాదికేశవాలయమునుండి వెడలఁగానే తనపాటలవర్ణమును గొంచెము విడిచి సూర్యుఁడు ప్రకాశించుచుండగా విజయఘోషాహూహూనానేక వరవీరబహుళసింహనాదబధిరితదిగంతంబును చలితోద్ధతతురగఖరతరఖురఖండితభూమండలోచ్ఛలద్విపులరజఃపటలాంతరితభాస్కరబింబంబును ప్రబలతరకర్ణతాళాస్ఫాలనోచ్చలితమదకరికుంభసిందూరసంధ్యాయమానదశదిశంబును ప్రళయజలధరధ్వానభీషణంబును నగు వారియొక్కయు మనయొక్కయు సైన్యసాగరము సన్నద్ధమయి యున్నప్పుడు వివేకమహారాజు మహామోహమహారాజుకడకు నైయాయికదర్శనమును దూతనుగాఁ బంపెను. అతఁడు పోయి మహామోహునితో నిట్లనియె—

మ. నను, విష్ణ్వాలయపుణ్యకాననదీశౌన్నత్యభక్తాంతరం
గనివాసంబు త్యజించి, మ్లేచ్ఛమహికిం కస్ భృత్యవర్గంబులో
చనుచున్నన్, కరవాలదారితభవత్సర్వాంగధారాత్తఁట
ఘనరక్తంబులు త్రాగఁ గూఁతలిడుచుం గ్రాల్ మ్రింగు మీమాంసకుల్.

విష్ణు—తరువాత తరువాత.

శ్రద్ధ—దేవీ! తరువాతఁ గోపముచేత వికటలలాటతటతాండవితభ్రుకుటియై మహామోహుఁడు—"ఈదుర్నయపరిపాకఫలము వివేకుఁడే త్వరలో ననుభవించుఁగాక!" అని పలికి, తానే మొట్టమొదటఁ బాషండాగమబృందములను పాషండశాస్త్రసహితముగా యుద్ధమునకుఁ బురికొల్పెను. అంతలో [illegible] సైన్యమధ్యమునందు,

గీ. వేదవేదాంగతతు లుపవేదసమితి
స్మృతిపురాణేతిహాసాదు లెలమిఁ గొలువఁ
జంద్రికమకాంతితో సరస్వతి, సరోజ
కర [illegible] నిల్చె [illegible]

విష్ణు—తదనంతరము.

దైవవిచేష్టితంబునను దక్కఁ బాయుండితివా నీవు, శోకదహా !
జీవము శోధనుండెడిన ; నిసీ ! యసువుల్ కరముఁ దురంతముల్.

(అని మరల మూర్ఛపోవుచున్నాఁడు.)

సంక—ఓరాజా ! ఊరడిల్లుము, ఊరడిల్లుము.

మన—(తెలివి తెచ్చుకొని) ఇఁక నాకు జీవితాశ చాలును ఓసంకల్పా ! చితి పేర్పుము ఇప్పుడు నే నగ్నిప్రవేశముచేత శోకానలము నార్పుకొనియెదను.

(అని సన్నాహపడుచున్నాఁడు)

[అప్పుడు వ్యాససరస్వతి ప్రవేశించుచున్నది]

సర—“సఖీ ! సరస్వతీ ! అపత్యమరణఖిన్నుఁడయియున్న మనస్వియొక్క పరిబోధముకొఱకుఁ బొమ్ము. అతనికి వైరాగ్యోత్పత్తి యెట్లుకలుగునో యట్లుచేయుము” అని భగవతియైన విష్ణుభక్తిదేవి నన్నుఁ బంపినది కానిమ్ము. నేనిప్పు డాతని సన్నిధికి బోయెదను. (సమీపమునకుఁ బోయి) వత్సా ! ఈవిధముగా నీవతిసంతాపము నేల పొందెదవు ; పదార్థము లనిత్యములని నీకీపాటికిఁ దెలిసినదేకదా ! ఇతిహాసములును, ఉపాఖ్యానములును, నీవీవఱకుఁ జదివినవే.

చ. అరయ విరించి యింద్రుఁడు సురాసురులున్ మునిముఖ్యులు న్మనుల్
ధరణియు వార్ధులిట్టివగునట్టులు కల్పశతాయువు లైగన్,
బొరసెడ ఘోర శోకకరమోహము ! స్త్రీయులబుద్బుదోపమా
స్థిరతనుసంహతుల్ తెగి నశించినయప్పుడు మూఢు లేమనన్ ?

కాఁబట్టి ప్రపంచపదార్థములయనిత్యత్వమును భావించుకొమ్ము. నిత్యానిత్యవస్తువివేకి యగువానిని శోకమంటదు.

గీ. బ్రహ్మమొక్కఁడియే సత్యవస్తువగును
నితరమెల్ల వికల్పిత మెప్పుడగును,
యప్పు డేకత్వమును జూడు ? నట్టివాని
కెక్కడివి మోహశోకంబు లెంచిచూడ ;

మన—భగవతీ ! శోకావేగదూషితమైన యీ నా మనస్సునందు వివేకమునకే యవకాశము లేదు.

సర—వత్సా ! ఇది స్నేహదోషము. స్నేహము సర్వానర్థమూలకమన్న యర్థము సుప్రసిద్ధమేకదా !

మ. ప్రియసంతానంబునఁ గ్లేశదుర్వృక్షలతాబీజంబుల న్నాఁటఁగాఁ!
బయికిన్ స్నేహమయాంకురంబు లడరున్ దప్పాగ్ని గర్భంబు నై

నిందుఁ బ్రవేశపెట్టవలయును.

మన—భగవతీ! అశాంతవిషయమేదో ప్రసాదింపుము.

సర—వత్సా—అది రహస్యమైనది. అయినను శోకార్తుల కుపదేశించుటలో దోషములేదు.

చ. స్థిరమతి నీలనీరధరదేహుని శ్రీహరి నొండెఁ, దామసం
హరుని జాహ్నవీశిరు హరునొండె దలంపు; లేనిచో,
నిరతిని గ్రీష్మవేళ జలనీటికొలంకును బోలె నాత్మ న
ప్పరము నిరస్తశోకమును బ్రహ్మముఁ జొన్పి భజింపు నిర్వృతిన్.

మన—(ఆలోచించి నిట్టూర్పుతో) సర్వవిధములచేతను నేను దేవిగారిచేత రక్షింపఁబడినాఁడను. (అని పాదములమీఁదఁబడుచున్నాఁడు.)

సర—వత్సా! నీహృదయమిప్పటి కుపదేశతుల్యమయినది. కాఁబట్టి నీకు మతి యొకటికూడ నుపదేశించెదను.

మ. జనకుండో సుతుఁడో సఖుండో తనువుం జాలింప, ధీశూన్యులి
మ్మున శోకాగ్నిదహింతు రెంతయు మనమ్ము ల్మ్రందుకొం జొక్కటన్;
కన సంసార మసారమందు శమసౌఖ్యంబుం గనం బెంచుచున్
ఘనధీమంతుల కావిరోగచయమే కల్గించు వైరాగ్యమున్.

[అప్పుడు వైరాగ్యుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

వైరా—(ఆలోచించి)

మ. నవనీలోత్పల కోమలచ్ఛదముకన్నన్ సూక్ష్మవకాత్వక్కు మా
నవదేహంబులపై విధాత్రుఁడిటు నిండ న్మూయకున్నన్, సదా
ప్రసవదస్రావిసువిశ్రమాంసపిసర గ్రీపాగత ధ్వాంక్షగృ
ధ్రభృక్శ్వానములన్ మరల్పఁగను సాధ్యంబౌనె యెవ్వారికిన్?

మఱియును,

మ. తటిదాలోలము లక్ష్మిజాలము; రజోధ్వగ్రేహము ద్దేహముల్;
స్ఫుటసంభోగరసంబు లంతవిరసంబుల్; లోకముల్ శోకముల్;
ఘటితాంచద్ధనము స్మహానిధనముల్; హాము ల్విపత్సీమ, ల
క్కట! యప్లైర్యుఁ! జంతు రాత్మనిరతు గ్రాక్షీప్రపంచన్ జనుల్.

సర—వత్సా! ఇదె వైరాగ్యుఁడు నీదగ్గఱకు వచ్చుచున్నాఁడు. ఈతనిని గౌరవింపుము.

మన—నాపుత్రుఁడు వైరాగ్యుఁడా?

దివ్యుటన్ వృత్తు లడంచి నివృత్తిం గూడితే, నాత్మయున్
రవిబింబం బుదకప్రతిబింబమవలెన్, శాస్త్రైకతాచ్ఛం బగున్.

కానిమ్ము. జ్ఞాతుల కుదకప్రదానము చేయుటకొఱకు మనము నదికిఁ బోవుదము.

మన—దేవి సెలవిచ్చినట్లు చేయుదము.

[అందఱును నిష్క్రమించుచున్నారు.]

---

## షష్ఠాంకము.

---

[అప్పుడు శాంతి ప్రవేశించుచున్నది.]

శాంతి—(ప్రత్రి) ! ఇకెంతసేపుఁ దెలిసినదికదా ?

చ. కొమరులు పంచతంగనఁగ గూఢముగాఁ జని మోహుఁడేడనో
యడఁగుటచే విరక్తుఁడయి యల్లమనస్సు ప్రశాంతి నొందఁగా,
వడిగను క్లేశపంచకము పాయుటచేఁ బురుషుండు సొక్కటన్
గదుకొని తత్త్వబోధమునఁ గాంతుఁడయెసర్వుడు సెల్లయప్పుడున్.

కాఁబట్టి నీవతిత్వరితముగా నుపనిషద్దేవి ననునయించి నాసముఖమునకుఁ దీసికొనిరమ్ము. అని వివేకమహారాజుగారు నాతో సెలవిచ్చినారు. (చూచి) ఇదిగో తనలోఁదా నేదో సంతోషముతో నాలోచించుకొనుచు నాతల్లి యీవంకనే వచ్చుచున్నది.

[అంతట శ్రద్ధ ప్రవేశించుచున్నది]

శ్రద్ధ—ఓహో ! రాజకుల మారోగ్యమును బొందఁగాఁ జూచి యిప్పుడుగదా చిరకాలమునకు నాకన్నులమృతరసపూర్ణము లయినవి.

గీ. కలిగె ఖలనిగ్రహము రాజకులమునందుఁ
బూజ్యులైరి శమాదిసత్పురుషులెల్ల ?
జీవులెల్లను వశ్యులై సేవచేయ,
నెసఁగుచున్నారు సర్వలోకేశ్వరుండు.

శాంతి—(చేరఁబోయి) అమ్మా! నీవునిలుచుండి యేమియాలోచించుచున్నావు?

శ్రద్ధ—బిడ్డా! రాజకుల మారోగ్యమును బొందఁగా జూచి చిరకాలమునకిప్పుడుగదా నాకన్నులమృతరసపూర్ణము లయినవి.

గీ. కలిగె ఖలనిగ్రహము రాజకులమునందు
బూజ్యులైరి శమాదిసత్పురుషులెల్ల;
జీవులెల్లను పశువులై సేవచేయ,
నెసఁగుచున్నాఁడు సర్వలోకేశ్వరుండు.

(అని మరలఁ బఠించుచున్నది.)

శాంతి—ఇప్పుడు మనస్సువిషయమున స్వామియైన పురుషుని ప్రవర్తన మెట్లున్నది!

శ్రద్ధ—వధ్యునివిషయమును నిగ్రాహ్యుని విషయమును నెట్లుండవలయునో యట్లున్నది.

శాంతి—అట్లయిన, స్వామియే సామ్రాజ్యము నలంకరించునా యేమి?

శ్రద్ధ—దానికి సందేహమేమి? ఆత్మానుసంధానము చేసినయెడల, స్వామియే స్వారాట్టును సమ్రాట్టును నగును.

శాంతి—ఇంక జీవేశ్వరులకు మాయయందు దృష్టియనుగ్రహము గలదు

శ్రద్ధ—నిగ్రహమని చెప్పవలెను. అనుగ్రహ మెట్లు శక్యమగును? పురుషుఁడిప్పుడు సర్వావస్థబీజభూత యయినయామాయ సర్వథా నిగ్రాహ్యురాలని తలఁచుచున్నాఁడు.

శాంతి—అట్లయినపక్షమున, రాజకులముయొక్క స్థితి యిప్పుడెట్లున్నది;

శ్రద్ధ—వినుము. పురుషునకు—

శా. నిత్యానిత్యవిమర్శ యిష్టసతి; సన్మిత్రుండు వైరాగ్యుఁ డా
త్మారోగ్యంబాగ్రహితుల్ యమాదులు; సహాయాప్తుల్ శమాద్యుత్తముల్
మైత్ర్యాదుల్ పరిచారికల్; సహచరీమాతల్లి మోక్షేచ్ఛ; దు
ష్కృత్యుల్ లోభమహమమత్వముఖ్యారిపు లుచ్ఛేద్యు లబలాత్కారతన్.

శాంతి—మఱి ధర్మునియెడల స్వామి కెట్టి ప్రీతి కలదు?

శ్రద్ధ—పుత్త్రీ! వైరాగ్యసన్నికర్ష మయినది మొదలుకొని స్వామియిహపర ఫలభోగములయందు నితాంతమును విరసుఁడయియే యున్నాఁడు. అందుచేతనే యతఁడు

గీ. నరకహేతువౌ పాపంబునకును బోలె,
స్వర్గ మని పుణ్యఫలంబునకును వెఱచు;
శుద్ధవిహారవంతను జేయుసుకృతకర్మ
మునకు నెట్టులో తా నియ్యకొనుచు నుండు.

ఇట్లు స్వామి యాత్మైకనిష్ఠుఁడయి యుండుట కనిపెట్టి ధర్ముఁడు తాను గృతకృత్యుఁ డయినట్లెంచుకొని తనకుఁ దానే తనవ్యాపారమును వదలుకొన్నవాఁడయ్యెను.

శాంతి—అప్పుడు యోగవిఘ్నులను వెంటఁగొని మహామోహుఁడు విద్భక్తిఁ జయ్యనే, వారివృత్తాంత మేమి ?

శ్రద్ధ—పుత్రీ ! అట్టిమరణస్థను బొందినవాఁడయ్యును మహామోహాంతకుఁడు స్వామిని మోసపుచ్చుటకయి మధుమతి యనువిద్యతోఁ గూడ యోగవిఘ్నులను బంపెను. స్వామి వారియందుఁ దగులుకొన్నయెడల, వివేకుఁ డుపనిషచ్చింత నైనను జేయకుండునని వానియభిప్రాయము.

శాంతి—ఔరా ! తరువాత ! తరువాత ?

శ్రద్ధ—తరువాత వారుపోయి స్వామికొక యైంద్రజాలికవిద్యను జూపిరి. వారొక యద్భుతైశ్వర్యాకారరూపమును జూపి సంభ్రమముతో నిట్లనిరి. ఓస్వామీ !

చ. అచిరముగా నితండు విను నబ్రిపడన్ శతయోజనధ్వనుల్ ;
ప్రసురము చేయు మున్వనని భారతి నవపురాణగాథలన్ ;
రచనయొనర్చు శుద్ధపదరమ్యత స్వేచ్ఛను గావ్యశాస్త్రముల్ ;
ఖచరగతిం జరించును జగంబుల ; నేరుమణిస్థలుల్లనున్.

అతఁడు మధుమతీవిద్యచేతఁ గల్పింపఁబడిన ప్రదేశమును జేరఁగా, స్థానాభిమానదేవతలాతఁ బుట్టునట్లుగా నిట్లనిరి:—అయ్యా ! ఇందుఁగూరుచుండుము ; ఇక్కడజననమరణములు లేవు ? ఈప్రదేశము సహజసుందర మయినది? వివిధవిలాసవేషలావణ్యవతులును బుణ్యమయములు మంగళోర్ధ్వ్యగ్రపాణులును బ్రణయకృత్యచతురలును నగువిద్యాధరకాంతలు నీరె నీయొద్దనున్నారు. కాఁబట్టి యిటురమ్ము.

గీ. కనక నికేతనస్థలములు కలుగునవుల,
ఘనజసువలు వశోరులా కమలముఖులు,
మరకతవళవృదువసాళిఁ, బొరయుమీవు
పుణ్యసముపార్జితాఖిలభోగములను.

శాంతి—అటుపిమ్మట ?

శ్రద్ధ—పుత్రీ ! ఆమాటలువిని మాయ యిది శ్లాఘ్యమయినదని చెప్పెను; మనస్సనుమోదించెను. సంకల్పుఁడును బ్రోత్సాహపఱిచెను. స్వామి యంగీకారమార్గమును బొందినవానివలె నుండెను.

శాంతి—(ఖేదముతో) అయ్యో ! స్వామి మరలసంసారవాగురలోఁ దగులుకొనుచున్నాఁడు.

శ్రద్ధ—లేదు. లేదు.

శాంతి—పిమ్మట నేమిజరిగినది ?

శ్రద్ధ—అప్పుడు పార్శ్వవర్తియైన శిష్యుఁడు వారినందఱిని గాఢావేశ[illegible] యితలోచనుఁడయి చూచి, స్వామినిగూర్చి యిట్లనియె:—“ఓస్వామీ! విషయామిషగ్రాసాభిలాషులును సభాప్రతారణధూర్తబకులును నైన వీరిట్లు నిన్ను మఱచి దుస్సహ విషయాగ్నిజ్వాలలయందుఁ బడఁద్రోయుచుండఁగాఁ దెలిసికోలేకున్నావేమి?

క. భవసాగరముం దాఁటఁగ
నవలీలం బ్రాప్తమైనయలయోగతరిన్
దవుల విడనాడి వెస నిపు
డవగాహన మేల చేసె దంగారనదిన్?

శాంతి—అటుతరువాత!

శ్రద్ధ—అప్పుడాతనిమాటవిని, ‘విషయసుఖములకు నమస్కార’మనిపలికి, పురుషుఁడు సుధుమతిని దిరస్కారము చేసెను.

శాంతి—మేలు! మేలు! నీవిప్పుడెక్కడకు బయలుదేరినావు?

శ్రద్ధ—“నేను వివేకునిఁ జూడఁగోరుచున్నాను. కాఁబట్టి నీవాతనిని శీఘ్రముగాఁ గొనిరమ్ము.” అని స్వామి నాకాజ్ఞయిచ్చెను. కాఁబట్టి నేనిప్పుడు మహారాజు సన్నిధికి బయలుదేరినాను.

శాంతి—నాకును మహారాజుగారుపనిషద్దేవిని దీసికొనిరమ్మని యాజ్ఞయిచ్చినాఁడు. కాఁగాక! మనము స్వామినియోగమును నెఱవేర్తము.

(అని యిద్దఱును నిష్క్రమించుచున్నారు.)

ఇది ప్రవేశకము.

---

[అప్పుడు పురుషుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

పురు—(ఆలోచించి హర్షముతో) ఓహో! ఏమి యీవిష్ణుభక్తిదేవిమాహాత్మ్యము; ఆమెయనుగ్రహముచేత నేను—

మ. వడిఁ గ్లేశోర్ముల నాక్రమించి, మమతావర్తంబులన్ దాఁటితిన్;
గడఁకన్ మిత్రకళత్రబంధుమకరగ్రాహంబులం దోలితిన్?
జడఁగా నార్చితిఁ గ్రోధబాడబశిఖిన్; దృష్ణాలతల్ ద్రెంచితిన్;
గడు సంసారసముద్రతీర మిపుడే గంటిన్ సమీపింపఁగన్.

[అంతట నుపనిషద్దేవియు శాంతియుఁ బ్రవేశించుచున్నారు.]

ఉప—సఖీ! అట్టు నిర్దయుఁడయి యీఁడినధర యొక్క ముఖమును నేనెటు

చూడఁగలను ? అతనిచేత నేను చిరకాలము పరదారవలె విడిచిపెట్టఁబడి యేకాకిని నయి యుంటిని.

శాంతి—దేవీ ! ఆవిధముగా నాపదలపాలయినభర్తగారి నేల నిందించెదవు ?

ఉప—సఖీ ! ఇట్లు చెప్పెదు నీ వప్పటి నాకష్టదశను జూడలేదు వినుము—

చ. అకట ! వివేకుఁ డిట్లు విధియత్నమునన్ నను దవ్వొనర్చినన్,
సకలఖలుల్ కుబుద్ధి మెయి నన్ దమదాసిగఁ జేయ నీడ్వఁగా
శకలనులై మణుల్పడల జంకి చెడెం గరకంకణావళుల్ ;
ప్రకట శిరోమణుల్గోనఁగ లాగుటచేఁ దెగెఁ గేశపాశముల్.

శాంతి—సఖీ ! ఇది యంతయు నామహామోహుని దుర్విలసితము. ఇందుభర్తగారి యపరాధ మేదియు లేదు. వానిచేతనే మనస్సు కామాదుల ద్వారమున మోహపెట్టఁబడుటచే వివేకుఁడు నిన్నుండి దూరము చేయఁబడినాఁడు. ఇట్లు విపన్నుఁ డయిన నిజవల్లభుని సమయము ప్రతీక్షించి యుండుట కులస్త్రీలకు నైసర్గికశీలము కాఁబట్టి నీవువచ్చి దర్శనముచేతను బ్రియాలాపముచేతను భర్తను సంభావింపుము. ఇప్పుడు శత్రులు హతము చేయఁబడినారు. నీమనోరథములు సంపూర్ణములయినవి.

ఉప—సఖీ ! నేనిప్పుడిట వచ్చునప్పుడు నాకూఁతురైనగీతాదేవి రహస్యముగా "స్వామియైన పురుషుఁడును భర్తయు నిన్నడిగినప్రశ్నలకు నుత్తరములు చెప్పి నీవు వారిని సంభావింపవలయును ; తన్మూలమునఁ బ్రబోధోత్పత్తి కాఁగలదు." అని చెప్పినది. నే నెట్లు గురుజనులముందు బ్రాగల్భ్యమును జూపఁగలను ?

శాంతి—దేవీ ! భగవతియైన గీతాదేవియొక్క యీవాక్యమునను విచారింపఁబని లేదు. ఈయర్థము నేభగవతియైన విష్ణుభక్తిదేవి వివేకస్వామితోడఁ జెప్పినది. కాఁబట్టి వచ్చిభర్తను, ఆదిపురుషుని, నీదర్శనముచేత సన్మానింపుము.

ఉప—ప్రియసఖి చెప్పినట్లు చేసెదను. (అని ముందుకు నడుచుచున్నది.)

[అప్పుడు వివేకమహారాజును శ్రద్ధయుఁ బ్రవేశించుచున్నారు.]

వివే—ఓవత్సా! శ్రద్ధా! శాంతి నాప్రియురాలైనయుపనిషత్కాంతనుజూచునా?

శ్రద్ధ—దేవా ! మీయాజ్ఞను దలఁదాల్చిపోయినశాంతి యామె నెట్లు చూడకుండును ?

వివే—ఎక్కడఁజూచును ?

శ్రద్ధ—దేవా ! మందరపర్వతమునందు మధుసూదనాలయములో నామెతర్కవిద్యాభయముచేతగీతాదేవిమఠముఁగు చొచ్చియున్నదని యీవార్తకేవిష్ణుభక్తిదేవి చెప్పినది

వివే—తర్కవిద్యల కేల భయపడవలెను ?

శ్రద్ధ—దేవా! ఈసంగతి నాకా మెయె వివరముగాఁ జెప్పఁగలదు. కాఁబట్టి దేవరవారు విచ్చేయుఁడు. ఇదె పురుషుఁడు మాయాగమనమునే తలఁచుకొనుచు నొంటిగా నున్నవాఁడు.

వివే—(చేరవచ్చి) స్వామీ! అభివాదము చేయుచున్నాను.

పురు—వత్సా! ఈశిష్టాచారము ప్రక్రమవిరుద్ధమయినది. జ్ఞానవృద్ధుఁడవైననీవే నాకుపదేశదానముచేతఁ బితృభావము బొందితివి ఎట్లన—

సీ. మున్ను ధర్మమార్గము తప్పి భూమిసురులు
తనయులను వేఁడుకొని దల్లదారి చూప;
శిష్యులగ వారిజ్ఞానంబుచే గ్రహించి,
సుతులు 'సుతులార! వినుఁ'డని పితల ననిరి.

కాఁబట్టి నీవును మాయెడలఁ బితృత్వముచేత వర్తింపవలయును. ఆదియెధర్మము.

శాంతి—దేవీ! ఇదె వివేకునితోడఁ బురుషుఁ డొంటిగా నున్నాఁడు. సన్నిధికిఁ బొమ్మ.

ఉప—(సమీపమునకుఁ బోవుచున్నది.)

శాంతి—స్వామీ! ఉపనిషద్దేవి యిదిగో మీపాదవందనము చేయవచ్చియున్నది.

పురు—అట్లుకాదు. అట్లుకాదు. తత్త్వావబోధోదయముచేత నీమెయే నాకు మాత. కాఁబట్టి నేనే యీమెకు నమస్కరింపవలెను. అంతేకాక,

క. జననికి దేవకిఁ గలది
నను గ్రహముఁ జూపుటందునంతర మెంతో;
జనని భవబంధములఁ గడుఁ
బెంచును; బంధములు దేవి విడిపించుఁగదున్.

ఉప—(వివేకునిఁ జూచి నమస్కరించి దూరముగాఁ గూర్చున్నది.)

పురు—అమ్మా! నీవింతవఱకును దినము లెట్లుగడపితివో చెప్పుము.

ఉప—స్వామీ!

ఉ. పుచ్చితిఁ బెక్కునాళ్ళు ఘనమూర్ఖులతోడను నేమతంబులన్,
రచ్చల, శూన్యదేవభవనంబుల, వ్యర్థవచఃప్రసంగతిన్.

పురు—మతి వారు నీచేతఁ దత్త్వమునేమైనఁ దెలిసికొన్నారా?

ఉప—లేదు. లేదు. వారు—

మచ్చిక ద్రావిడాంగనలమాటలకట్లు గ్రహింపరర్థముల్,
జెప్పిర నన్నుముక్కలుగ స్వేచ్ఛఁ గొనర్చి రపార్థకల్పనల్.

మతము విడిచి యార్హతశాసనము నవలంబించి దిగంబరవ్రతమును ధరింపుము.

బుద్ధా—ఓరి పాపుఁడా! నీవు పాడగుటయే కాక యితరులను గూడఁ బాడుచేయఁ జూచుచున్నావా?

క. పావనసత్వస్తోత్రీయము
భావింప ననింద్య మద్ది వర్జించి వెసన్
నీవలెను వికాచత్వము
నీవసుధను లోకనింద్య మెవ్వఁడు కోరున్?

యార్హతమతధర్మ మెవ్వఁ డవలంబించును?

దిగం—గర్గసాత్విక వారాహం దనూర్ధ్యోపరాగ శుక్రిరాహుపరమార్థజ్ఞానసంవాద శాస్త్రములచేతనే భగవంతుఁడయిన యార్హతుని సర్వజ్ఞత్వము నిరూపితమైనది.

బుద్ధా—(నవ్వి) అనాదిసిద్ధమయిన జ్యోతిశ్శాస్త్రమువలని యింద్రియాగోచర జ్ఞానముచేత మోసపోయి నీవీయతికష్టవ్రతము నాశ్రయించుచున్నావు.

చ. పరిమితమైన దేహమునఁ బాయక లోపలనుండు జీవుఁడే
సరణి నెఱుంగ నేయుచు నసంగతిమై భువనత్రయంబు గిక్కి?
కరము జ్వలించుచున్న, ఘటగర్భమునందిడినట్టిదీప మే
కరణి నిజాపనోపు గృహగర్భమునం గలవస్తుసంతతిన్?

కాఁబట్టి లోకద్వయవిరుద్ధమయిన యార్హతమతముకంటె బుద్ధమతమే శ్రేష్ఠమయినదిగాను, కేవలసుఖావహమయినదిగాను, మిక్కిలి రమణీయమయినదిగాను, నాదృష్టికి గోచరమగుచున్నది.

శాంతి—సఖీ! మనము మఱియొకచోటికిఁ బోవుదము.

కరుణ—అలాగుననే చేయుదము. (అని ముందుకు నడుచుచున్నారు.)

శాంతి—(ముందువంకఁ జూచి) మనముందున్న యీ పురుషుఁడు సోమసిద్ధాంతుఁడు. కానిమ్ము. మనము కడకుఁ గూడఁ బోవుదము.

[అప్పుడు కాపాలికరూపధారియయిన సోమసిద్ధాంతుఁడు
ప్రవేశించుచున్నాఁడు.]

సోమ—(ముందుకు నడిచి)

మ. సముదారోగ్రనరాస్థిమాలికలు భూషల్ గా, శ్మశానంబె వి
శ్రమవాసస్థలిగాఁగ భోజనపుఁబాత్రల్ పుర్రెలై యొప్ప, ను
త్తమ యోగాంజనశుద్ధదృష్టిమెయి సందర్శింతు నన్యోన్యభి
న్నములీలోకము, లీశుకంటె నవిభిన్నంబుల్ గదా యంచెదన్.

దిగం...ఓహో! ఈపురుషుఁడు కాపాలికవ్రతమును ధరించుచున్నాఁడు, ఈతనిఁగూడ నొకప్రశ్న యడిగెదను. (సమీపించి) ఓరీ! కాపాలికా! నరాస్థికపాలధారీ! నీధర్మ మెటువంటిది? నీమోక్ష మెటువంటిది?

సోమ—ఓరీ! క్షపణకా! ఇప్పుడు నాధర్మమును శ్రద్ధతో వినుము.

శా. మస్తిష్కాన్త్రవసాభిఘారితమహామాంసంబు వ్రేల్తున్ శిఖిన్;
శస్త్రబ్రహ్మకపాలపూరితసురన్ సద్భక్తి సేవింపుదున్;
ప్రస్తుత్యగ్రనికృత్తకంఠవిగళద్రక్తోగ్రధారాతతిన్
హస్తద్వంద్వకృతోపహార మిడి నేనర్చింతు నాభైరవున్.

బుద్ధా—(చెవులుమూసుకొని) కటకటా! ఈధర్మచర్యమహాదారుణముకదా!

దిగం—అర్హత! అర్హత! ఘోరపాపకారియెవ్వఁడో యీబుద్ధిహీనుని వంచించెను.

సోమ—(కోపముతో) ఓరీ! పాపాత్మా! పాషండాధమా! బోడీ! చండాలా! శిఖోల్లుంఛకా! చతుర్దశభువనోత్పత్తిస్థితిప్రళయ ప్రవర్తకుండును వేదాంతసిద్ధాంతప్రసిద్ధప్రభావుండును భగవంతుండునునగు భవానీవల్లభుండు వంచకుఁడురా? ఆయన ధర్మమహిమను నేనిప్పుడు కనఁబఱిచెదను.

చ. హరిరుద్రాబ్జభవాది నిర్జరసమూహంబెల్ల రావించెదన్;
సరిగా మింటఁజరించు తారకలసంచారంబు నే నిల్పెదన్;
బుధశైలాదులతోడ నిమ్మహి పయఃపూర్ణంబుగావించి యా
వరతోయంబును ద్రావెదన్ క్షణములో భాండంబుల న్సర్వమున్.

దిగం—ఓరీ! కాపాలికా! నేనిందుచేతనే నిన్నెవ్వఁడో యైంద్రజాలికుఁడు మాయలుచూపి మోసముచేసెనని చెప్పియున్నాఁను.

సోమ—ఓరిపాపీ! పరమేశ్వరు నైంద్రజాలికుఁడని యింకను నాక్షేపించుచున్నావా? నీదుష్టత్వము కోపోద్రేకము కలిగించుచున్నది. (కత్తి యొరనుండితీసి)

ఉ. ఈనిశితోగ్రఖడ్గవినికృత్తభవద్గళనాళికోచ్ఛలత్
ఫేనిలబుద్బుదౌఘయుతభీకరశోణితభూరిధారలన్
నేనిదె తృప్తిచేసెద వినిశ్చలభక్తిని దుర్గ కిప్డు క్రీ
డానినదోల్లసడ్డమరుఢాంకరణాగతభూతవర్గకున్

(అని కత్తి పైకెత్తుచున్నాఁడు.)

దిగం—(భయముతో) ఓమహానుభావా! అహింస పరమధర్మముసుమా. (అని బుద్ధాగముని మఱుఁగు చొచ్చుచున్నాఁడు.)

బుద్ధా—(సోమసిద్ధాంతుని వారించుచు) ఓమహానుభావా! వినోదార్థముగా జరపఁబడినయీవాక్కలహమునుబట్టి యీతాపసుని గొట్టుట యుక్తముకాదు.

సోమ—(ఖడ్గము నొరలో వేయుచున్నాఁడు.)

దిగం—(ఊరటనొంది) ఓమహానుభావా! ఇప్పుడు మీయుద్భవిల్లిన ఘోరరోషము శాంతిపొందినపక్షమున, నేను మిమ్ముఁగొన్నిప్రశ్నలడుగఁదలఁచి యున్నాను.

సోమ—అడుగు. అడుగు.

దిగం—మీయుత్తమధర్మమును నేను విన్నాఁడను. ఇఁక మీ మోక్షమెట్టిదో చెప్పుఁడు.

సోమ—వినుము—

మ. తమి నేరెన్ విషయానుభోగములచేఁ దక్కన్ సుఖంబందిరే?
యమలానందవిమోఘజీవదశయే యామోక్షవార్తేని, ధీ
భ్రమలే కవ్వఁడు కోరి వేఁడుకొనుఁ దత్పాషాణముక్తిం గనన్?
ప్రమదాలిన్ సతిఁగాఁగఁ దన్నుశివుఁగా భావించి యాలింగనం
బమరం జేసి సుఖింప ముక్తియగునం చాశర్వుఁడాడెంజుమీ.

శాంతి—పాపము శాంతిల్లును గాక! పాపము శాంతిల్లును గాక! భగవంతుఁడ యినభవానీపతి యిటువంటిశాస్త్రమునకుఁ దా నెప్పుడయినను గర్తయగునా? ఇది రెవ్వరోదురాత్ములు కల్పించిరి.

బుద్ధా—ఓమహానుభావా! రాగరహితులు కానివారికి ముక్తికలుగునన్నయీ మాట యాదరణీయము కాదు.

దిగం—ఓయీ! కాపాలికా! నీకుఁ గోపమురానిపక్షమున నేనొక్కమాట చెప్పెదను. రాగయుక్తుఁడయిన దేహధారి ముక్తుఁడగుననుట వేదవిరుద్ధము.

సోమ—(తనలో)అయ్యో! వీరిమనస్సులు శ్రద్ధారాహిత్యముచేతఁ జెడియున్నవి. కానిమ్ము. (తెరవంకఁజూచి ప్రకాశముగా) ఓశ్రద్ధా! ఇటురమ్ము.

[అప్పుడు కాపాలినీరూప ధారిణియైన శ్రద్ధ ప్రవేశించుచున్నది.]

కరుణ—సఖీ! చూడు. రజస్సుయొక్కకూఁతురైన యీశ్రద్ధనుజూడు. ఈమె—

చం. విరిసిననల్లగల్వలను వీఁకయడంచువిలోలనేత్రముల్,
నరవిమలాస్థినిర్మితకనత్కమనీయవిభూషణావళుల్,
గురుజఘనస్థనాతిభరకుంఠితకోమలమందయానముల్,
సురుచిరపూర్ణచంద్రనిభసుందరవక్త్రము నొప్పనొప్పెడున్

శ్రద్ధ—(ముందుకువచ్చి) ఇదిగోవచ్చినదానను. స్వామీ! ఏమియాజ్ఞ?

సోమ — ప్రియురాలా! దురభిమానియయిన యీభిక్షుని ముందుగాఁ గౌఁగిలించు కొమ్ము.

శ్రద్ధ — (బుద్ధాగముని నాలింగనము చేసికొనుచున్నది.)

బుద్ధా — (సంతోషముతో నాలింగనము చేసికొని యొడలు గగుర్పొడువఁగా జనాంతికముగా) ఓహో! ఏమి యీ కాపాలినీసుఖస్పర్శ!

చ. చండతరానురాగమునఁ జన్నులు పాణుల నొత్తి పల్వురన్
రండలఁ గౌఁగిలించితి ఘనస్తనభారలఁ బొల్చి; యెందు నీ
చండికచోపగూహభవసౌఖ్యముతో సరిగాన నంచు నే
దండిగ నూఱుసార్లు శపథంబులు చేసెద బుద్ధుతోడుగన్.

ఓహో! కాపాలికచరిత మెంత పుణ్యప్రదమయినది! ఓహో! సోమసిద్ధాంత మెంత శ్లాఘ్యమయినది! ఈధర్మ మాశ్చర్యకరమయినది. ఓమహానుభావా సర్వవిధములచేతను నేను బుద్ధానుశాసనమును విడిచి నీపరమేశ్వరసిద్ధాంతమునందుఁ బ్రవేశించెదను. ఇప్పుడు నీవాచార్యుఁడవు; నేను శిష్యుఁడను. కాఁబట్టి నన్నిప్పుడే పారమేశ్వరదీక్షయందుఁ బ్రవేశపెట్టుము.

దిగం — ఓరీ! భిక్షుకా! నీవు కాపాలినీస్పర్శనముచేత మయిలపడినాఁడవు. కాఁబట్టి దూరముగా నుండుము.

బుద్ధా — ఓరి పాపాత్మ! కాపాలినియొక్క పరిరంభణమహోత్సవముఁ గానక నేనింతవఱకును వంచితుఁడనయితిని.

సోమ — ఓప్రియురాలా! నీవిప్పుడీక్షపణకునిఁగూడ నాలింగనము చేసికొమ్ము.

శ్రద్ధ — (దిగంబరసిద్ధాంతునిఁ గౌఁగిలించుకొనుచున్నది.)

దిగం — (గగుర్పాటుతో) ఓహో! అర్హంత! అర్హంత! ఓహో! ఏమి యీ కాపాలినీసుఖస్పర్శనము! ఓసుందరీ! నీవింకొకసారి నన్ను మరలఁ గౌఁగిటఁ జేర్పుము. (తనలో) ఔరా! నే నిప్పుడు మహత్తరమయిన యొక యింద్రియవికారమునకు లోఁబడినాఁడను! ఇఁక నేమి యుపాయము? ఇప్పుడేది యుక్తము? కానిమ్ము. ఇప్పుడీ పింఛికంథము కప్పుకొనెదను. (అని యట్లు చేయుచున్నాఁడు.)

క. ఓపీనఘనస్తని! ఓ
కాపాలిని! భీతహరిణకమనీయాక్షీ!
మాపటి కీవు రమించిన,
నాపయిఁ జేయఁగలదేది యాశ్రావకిచేన్!

ఓహో! కాపాలికశాస్త్ర మొక్కటియే భోగమోక్షసాధనము! ఓయాచార్యా నేఁ

నిప్పుడు నీదాసుఁడ నయినాఁడను. నన్నుఁ గూడ శ్రీమహాభైరవాను శాసనమునందు దీక్షితుని జేయుము.

సోమ—కూరుచుండుము.

ఇద్దఱు—(కూరుచున్నారు.)

సోమ—(పాత్రము చేతఁబట్టుకొని ధ్యానము నభినయించుచున్నాఁడు.)

శ్రద్ధ—ఓదేవా! ఈపాత్రము సురాపూరితమయినది.

సోమ—(మాఁచి తానుగొంత త్రాగి మిగిలినదానిని బుద్ధాగమ దిగంబర సిద్ధాంతులకిచ్చుచున్నాఁడు.)

క. ఇదిపావన మిది యమృతం
బిది యఘహరోగౌషధ మిది యాశ్వాసఘటితం
బిది భవపాశచ్ఛేదక
మిది యాస్వాదింపుఁ డిపుడు తృప్తిగ వీరల్.

ఇద్దఱు—(ఆలోచించుకొనుచున్నారు.)

దిగం—మాకార్హతశాసనమునుబట్టి మద్యపానము కూడదు.

బుద్ధా—కాపాలికుఁ డెంగిలిచేసిన కల్లు నేనెట్లు త్రాగఁగలను.

సోమ—(ఆలోచించి జనాంతికముగా) ఓశ్రద్ధా! నీవాలోచించుచున్నావేమి? పశుత్వ మిప్పుడును వీరిని విడువలేదు. నావదన సంస్పర్శదోషమువలన సుర యపవిత్రమయినదని వీరెంచుకొనుచున్నారు. కాఁబట్టి, ఓపూజ్యురాలా! నీవక్త్రాసవముచేత దీనిని శుద్ధిచేసి వీరికిమ్ము. స్త్రీలనోరు సదా శుచియని తైర్థికులు సహితము చెప్పుచున్నారు.

శ్రద్ధ—దేవరవారాజ్ఞాపించినట్లు చేసెదను. (అని పానపాత్రము పుచ్చుకొని తాను గొంతత్రాగి మిగిలినదానిని వారిదాపునఁ బెట్టుచున్నది.)

బుద్ధా—ఇది మహాప్రసాదము. అనిపానపాత్రమందుకొని త్రాగుచున్నాఁడు. ఆహా! ఏమి యీసురయొక్క సువాసన!

చ. సకియలపొత్తునన్ వెనుకఁ జక్కఁగ నెన్నియొసార్లు కోరిన నే
వకుళసువాసనా మధురవారసతీవదనాసవంబు? ని
వ్యాకులసుందరీముఖమహోత్సవ మానఁగాఁక కేవలల్,
పరికటుసుధారసంబుపయి వాంఛ యొనర్తురె దీనిఁ గ్రోలినన్?

దిగం—ఓరీ! భిక్షుకా! అంతయు నీవే త్రాగకు. కాపాలినీ వదనోచ్ఛిష్టమయిన యీమద్యమును నాకుఁగూడఁ గొంతయిమ్ము.

బుద్ధా—(పానపాత్రము దిగంబర సిద్ధాంతుని ముందుంచుచున్నాఁడు.)

దిగం—(త్రాగి) ఓహో? ఏమి యీమద్యముయొక్క మాధుర్యము! ఏమి రుచి! ఏమిగంధము! ఏమి పరిమళము! అర్హదనుశాసనములోఁబడి చిరకాల మిటువంటి సురారసములేక మోసపోతిని. ఓభిక్షుకా! నాయంగములు తిరుగుచున్నవి. నేను శయనించెదను.

బుద్ధా—అటు చేయుము. (ఇద్దఱును బరున్నారు.)

సోమ—ఓప్రియురాలా! మనకిప్పుడు వెలలేక యిద్దఱుదాసులు లభించినారు. కాఁబట్టిమనము నృత్యము చేయుదము. (ఇద్దఱు నృత్యముచేయుచున్నారు.)

దిగం—ఓభిక్షుకా! ఈకాపాలికుఁడు—కాదుకాదు—ఈయాచార్యుఁడు కాపాలికునితోఁగూడ మంగళనృత్యము చేయుచున్నాఁడు. కాఁబట్టి వీరితో మనము కూడ నృత్యముచేయుదము.

బుద్ధా—ఆలాగుననే చేయుదము. (అని మదముచేతసోలుచు నృత్యముచేయుచున్నారు.)

దిగం—క. "ఓపీనఘనస్తని! ఓ
కాపాలిని! భీతహరిణకమనీయాక్షీ!
మాపటి కీవు రమించిన,
నాపయిఁ జేయఁగలదేది యాశ్రీకిచేన్ ?"

(అని పాడుచున్నాఁడు.)

బుద్ధా—ఆచార్యా! ఈశాస్త్రముమత్యద్భుతమయినది! ఇకకష్టపడనక్కఱలేకయే యభిమతార్థసిద్ధులు సంపాద్యములగుచున్నవి.

సోమ—ఇది యెంత యాశ్చర్యము! చూడు—

మ. తనియంబొందుదు రిప్సితార్థ విషయత్యాగంబు లేకీమతం
బున మోక్షప్రియు లష్టసిద్ధులఁ గరంబున్; యోగవిఘ్నంబులై
యునికిం బ్రాకృతమంత్రసిద్ధులను వశ్యోచ్చాటనాకర్షణామో
హనవిక్షోభణమారణాదులఁ దృణంబట్లెంతు రత్యంతమున్.

దిగం—ఓయీ! కాపాలికా! (ఆలోచించి) ఓకియాచార్యా! ఓరాజబాంధవా!! (అని తూలుచుఁ దిరుగుచున్నాఁడు.)

బుద్ధా—మున్నలవాటుపడినవాఁడగుటచేత నీతపస్వి మధుపానాధిక్యమువలన మిక్కిలి మత్తెక్కియున్నాఁడు. కాఁబట్టి యిప్పుడితనిమత్తు పోవుపని చేయవలెను.

సోమ—ఆలాగుననే చేయుదము. (అనితననోటిలోనితమ్మిదిగంబరసిద్ధాంతుని

కోటలోఁ బెట్టుచున్నాఁడు.)

దిగం—(స్పష్టుఁడయి) ఓయాచార్యా! నిన్నొక్కటి యడిగెదను. నీకిప్పుడు సురసాకర్షిణీమంత్రమందున్నశక్తి స్త్రీపురుషుల నాకర్షించుటలోఁ గూడఁ గలదా?

సోమ—ఇది యేమిగొప్పయని యడుగుచున్నావు? చూడు—

మ. వరవిద్యాధరకాంతలన్! సురసతీవారంబు, నాగేంద్ర సుం
దరులన్, యక్షవిలాసినీమణుల, మద్వాంఛానుసారంబుగా
మరి యెవ్వాఁరలనైన, ముజ్జగములన్ మద్గోప్యసంజ్ఞాఖ్యము
ప్రవరవిద్యాబల గౌరవంబున సమాకర్షింపఁగాఁ జాలుదున్.

దిగం—ఓయీ! మనమందరమును మహామోహుని కింకరుల మని యిప్పుడు నేను గణితముచేతఁ దెలిసికొన్నాఁడను.

ఇద్దఱు—నీవు తెలిసికొన్నదంతయు సత్యమే.

దిగం—అట్లయిన యెడల మనమిప్పుడు రాజకార్యమొకటియాలోచింపవలెను.

సోమ—అది యేది?

దిగం—సత్త్వపుత్రికయైన శ్రద్ధను రాజుగారి యాజ్ఞాప్రకారముగా మనము పట్టి తేవలెను.

సోమ—ఆతొత్తుకూఁతు రెక్కడనున్నదో నాకుఁ జెప్పుము. నేను వెంటనే దానిని నావిద్యాబలముచేత నాకర్షించి తెప్పించెదను.

దిగం—నేనిప్పుడు లెక్కవేసి నీకుఁజూపెదను. (అని బలపము పుచ్చుకొని భూమిమీఁద స్థానములు వేసి గణించుచున్నాఁడు.)

శాంతి—సఖీ! ఇప్పుడు పాపాత్ములయిన వీరిమాటలు మాతల్లిని గూర్చినవైనట్లు వినఁబడుచున్నవి. మనము సావధానముగా విందము.

కరుణ—సఖీ! ఆలాగుననే చేయుదము. (అని యిద్దఱు నాలకించుచున్నారు.)

దిగం—గీ. జలమునను లేదు; లే దెందు స్థలమునందు!
శైలముల లేదు; లేదు పాతాళమందు;
శ్రద్ధ యయ్యది హరిభక్తిసహితయగుచు
నున్న దిపుడు మహాత్ములయుల్లములను.

కరుణ—(ఆనందముతో)సఖీ! నీవు భాగ్యశాలినివి. శ్రద్ధానిష్ఠ భక్తిదేవియొక్క పార్శ్వవర్తినియయియున్నది.

శాంతి—(హర్షము నటించుచున్నది.)

శ్రద్ధా—మఱి కామునివిడిపోయిన ధర్ముఁ డెక్కడనున్నాఁడు?

దిగం—(మరల సంగాలు గణించి)

గీ. జలమునను లేదు; లేదెందు స్థలమునందు;
శైలముల లేదు; లేదు పాతాళమందు;
విష్ణుభక్తితో ధర్ముండు వెడ్లెఁగూడి;
యున్నవాఁడు మహాత్ములయుల్లములను.

సోమ—(విషాదముతో) అక్కటా! మనమహారాజునకు గొప్పకష్టము వచ్చినది.

చ. తలఁపఁగ విష్ణుభక్తియె నిదానము శాశ్వతహర్షసిద్ధికిన్;
గలసెను దానితో నపుడు కన్నన సత్త్వవమూరిశ్రద్ధయున్;
జెలియగుకాముని న్విడిచి చేరెను ధర్ముఁడుగూడ నచ్చటన్;
దలఁతు వివేకకార్య మిఁకఁ దద్దయు సిద్ధినిబొందినట్లుగన్.

అయినను మనము ప్రాణాంతోపద్రవము వచ్చినను వెనుకతీయక స్వామికార్యమును జేయవలెను. ఇప్పుడు ధర్మశ్రద్ధలను బట్టి తెచ్చుటకయి మహాభైరవీవిద్యను బంపు చేసెదను. (అని ముగ్గురును నిష్క్రమించుచున్నారు.)

శాంతి—సఖీ! ఇప్పుడు మనమును హతాశ లయినవీరి దుర్వ్యవసాయమును దేవియైనవిష్ణుభక్తికి నివేదింతము. రమ్ము.

(అని నిష్క్రమించుచున్నారు.)



## చతుర్థాంకము.



[అప్పుడు మైత్రి ప్రవేశించుచున్నది.]

మైత్రి—మహాభైరవియొక్క వాతఁబడకుండ ధర్మునితోఁగూడ నాప్రియసఖియైనశ్రద్ధను విష్ణుభక్తి కాపాడెనని ముదితవలన నేను విన్నదానను. కాఁబట్టి యీ తహతహ పడుచున్న మనస్సుతో నాప్రియసఖి నెక్కడఁ జూడఁ గలుగుదును?

(అని ముందుకు నడుచుచున్నది.)

[అంతట శ్రద్ధ ప్రవేశించుచున్నది.]

శ్రద్ధ—(నాలుగు దిక్కులనుజూచి భయోత్కంపముతో)

మ. వెనుకన్, మర్త్యకపాలకుండలవతిన్, విద్యుచ్ఛటావిక్షిప
ద్ఘనదృష్టిన్, శిఖికీలికారుణకచాత్యంతోగ్రి, భాళేందుర
శ్మినిభోద్యత్తీక్ష్ణరదంష్ట్రికాంతరచలజ్జిహ్వాన్, మహాభైరవిన్
గనుచున్నట్లు వడంకెఁ జిత్తమిపుడున్ రంభాదళప్రక్రియన్.

మైత్రి—(తనలో) అయ్యో! నాప్రియసఖియైనశ్రద్ధాదేవి భయసంభ్రమోద్భ్రాంతహృదయయయి గాలిచేఁగదలుచున్న కదళీతరుప్రకాండమువలెఁ గంపమొందుచున్న యంగములతోఁదనలోఁ దానేదో యాలోచించుకొనుచు, దాపునకు వచ్చినను నన్నుఁజూడకున్నది. కాఁబట్టి నేనేయీమెను బలుకరించెదను. (ప్రకాశముగా) ఓప్రియసఖీ!శ్రద్ధా! ఇదేమి? నీవుమనస్తాపముచేత నన్ను సహితము చూడకున్నావు?

శ్రద్ధ—(చూచి నిట్టూర్పుతో) ఓప్రియసఖీ! మైత్రీ!

క. చెలి? కాళరాత్రినోటను
బలుకోఱలనడుమఁ జిక్కి ప్రాణముతోడన్
వెలువడుచు నేను గనుఁగొనఁ
గలిగితి నీజన్మమందె క్రమ్మఱ నిన్నున్.

కాఁబట్టి నీవు దగ్గఱగావచ్చి నన్నుఁ గౌగిలించుకొమ్ము.

మైత్రి—(ఆలింగనముచేసికొని) సఖీ! అట్లు విష్ణుభక్తి మహాభైరవియొక్క ప్రభావము నడఁచివేసినను, నీయంగము లింకను గంపమొందుచున్న వేమి?

శ్రద్ధ—మ. వెనుకన్, మస్తకపాలకుండలవతిన్, విద్యుచ్ఛటావిక్షిప
ద్ఘనదృష్టిన్, శిఖికీలికారుణకచాత్యంతోగ్ర, బాలేందుర
శ్మినిభోద్యత్ఖరదంష్ట్రికాంతరచలజ్జిహ్వన్, మహాభైరవిన్
గనుచున్నట్లు వడంకుఁ జిత్తమిప్పుడున్ రంభాదళప్రక్రియన్.

(అని మరలఁ బఠించుచున్నది.)

మైత్రి—(భయముతో) హా! నాతొశురాలయిన యామె ఘోరరూపము కలది గదా? ఆప్రకారముగావచ్చి యామె యేమిచేసినది?

శ్రద్ధ—సఖీ! వినుము—

చ. ధరణికి డేగడిగ్గువిధంబున భైరవి డిగ్గి, నన్ను దు
ర్భరచరణద్వయింబొదివి, వామకరంబున ధర్మ్ముఁ బట్టి, యం
బరమున కేఁగవేగఁ, బెనుమాంసపుముద్దలు రెండు గృధ్రిభీ
కరనఖరాగ్రకోటినిడి గ్రక్కున నింగికిఁ జాలుకైవడిన్.

మైత్రి—అయ్యో!అయ్యో! (అని మూర్ఛిల్లుచున్నది.)

శ్రద్ధ—సఖీ! ఊరడిల్లుము.

మైత్రి—(తెలివితెచ్చుకొని) తరువాత. తరువాత.

శ్రద్ధ—తరువాత నాయార్తనాదమువలన దయార్ద్రహృదయయయి—

మ. పారఁగద్దింపుచు విష్ణుభక్తి యచటన్ భ్రూభంగకౌటిల్యభీ
కరమున్ నిర్భరకోపపాటలము నౌ కంటన్ విలోకింపఁగా,
ధరణిం గూలెను, వజ్రపాతహతిచేతన్ భూమిపైఁ ద్రెళ్ళు సు
స్థిరభూభృచ్ఛిఖయట్లు, భైరవి శిరోస్థివ్రాతముల్ నుగ్గుగాన్.

మైత్రి—ప్రియసఖీ! దైవవశముచేతఁ బులినోటఁ బడి వెలువడినకురంగాంగన వలెనే నీవును నీభాగ్యముచేతఁ బ్రతుకఁగంటివి. తరువాత. తరువాత.

శ్రద్ధ—తరువాత విష్ణుభక్తిదేవి "నన్ను సహితము నవమానింపఁ బ్రవర్తించుచున్న దురాత్ముఁ డయిన యీమహామోహప్రేతమును నేను సమూలముగా నిర్మూలము చేసెదను" అని కోపావేశముతోఁ బలికి, నావంకఁ జూచి "ఓశ్రద్ధా! నీవుపోయి వివేకునితో నిట్లుచెప్పుము.—నీవు కామక్రోధాదులను నిగ్రహించుటకయి ప్రయత్నింపుము. అప్పుడు వైరాగ్యోదయము తప్పక కలుగును. నేనును సమయమువేచి ప్రాణాయామాదుల యుత్సాహము పుట్టించి నీసైన్యము ననుగ్రహించెదను. ఋతంభరాది దేవులు శాంత్యాదుల కౌశలముచేత నుపనిషద్దేవీసంగమమువలనఁ బుట్ట్యాఁడ వయిన నీకుఁ బ్రబోధచంద్రుఁ డుదయించు సాధనమును జేయుదురు. అని సెలవిచ్చినది. కాఁబట్టి నేనిప్పుడు వివేకుని సన్నిధికిఁబోవుచున్నాను. ఇప్పుడు నీ వేపనిమీఁద దినములు పుచ్చుచున్నావు?

మైత్రి—అక్కచెల్లెండ్రము మేము నలువురమును విష్ణుభక్తియొక్క యాజ్ఞచేత వివేకుని కార్యసిద్ధికొఱకు మహాత్ములయాత్మలయందు నివసించెదము.

చ. నను సుఖజీవులందుఁ, గరుణన్ ఘనదుఃఖితులందుఁ, బుణ్యకా
ర్యనిరతులందు సమ్ముదిత, భ్రష్టకుబుద్ధులయం దుపేక్ష, వా
రనుపఁదలంత్రు; మేమ దటనుండుట నాత్మలు రాగలోభము
ఖ్యాఖిలదోషదూషితము లయ్యును గాంచును నిర్మలత్వమున్.

కాఁబట్టి యీవిధముగాఁ దోబుట్టువులమైన మేము నలువురమును వివేకాభ్యుదయము కొఱకైనవ్యాపారముచేత వాసరములు గడపుచున్నాము. ఓప్రియసఖీ! నీవిప్పు డెక్కడ వివేకమహారాజును గనుఁగొనఁగలవు?

శ్రద్ధ—"రాధాదేశమని యొకటియున్నది. అక్కడ భాగీరథీసమీపప్రదేశమున నలంకారభూతమయిన చక్రతీర్థమునందు మీమాంసానుగతయైన మతిదేవితోఁ గూడ నెట్లో ప్రాణములు నిలుపుకొని వ్యాకులహృదయముతో నుపనిషద్దేవీసంగమార్థముగా వివేకుఁ డహర్నిశమును దపస్సుజేయుచున్నాఁడు." అనిదేవియైన విష్ణుభక్తియె నాతో సెలవిచ్చినది.

మైత్రి—ఓప్రియసఖీ! నీవప్పటికిఁబొమ్ము. నేనునునాపనికిఁబోయెదను.
శ్రద్ధ—అట్లు చేయుము.

(ఇద్దఱును నిష్క్రమించుచున్నారు.)

ఇది విష్కంభము.

---

[అప్పుడు వివేకమహారాజును బ్రతీహారియుఁ బ్రవేశించుచున్నారు.]

వివే—ఓరి మహామోహా! ఓరిదోసకారిపీనుఁగా! ఈమహాజనులెల్ల నీవల్ల సర్వవిధములచేతను జెడిపోయిరి.

శా. జ్ఞానానందము నిస్తరంగము మహాశాంతంబు ప్రోద్యన్మహా
త్మానూనంబు మహామృతాబ్ధిజల మహా! తాఁగఁ గల్గుండియున్;
వే నిస్సారమరీచికాజలమునందే మున్గుచుం దేలుచున్
జానస్నానము లాచరించెదరు. విభ్రాంతి న్విమూఢాత్మకుల్

సంసారచక్రవాహకుఁడై యున్న మహామోహుని కజ్ఞానమే మూలము. ఆ యజ్ఞానము తత్త్వబోధమువలననే నివృత్తికాఁగలదు. ఎట్లన—

గీ. అవని నజ్ఞానమూలకమైనయట్టి
పృథులసంసారవృక్షంబు పెల్లగించి
పరముఁ గూర్ప విశ్వేశ్వరోపాసనాఖ్య
బీజజన్యావబోధంబె వెరవుసుమ్ము

తలుమగా మంచివారు పూనినకార్యములకు దేవతలు తోడుపడుదురని తత్త్వవేత్తలు చెప్పుదురు. అందుచేతనే విష్ణుభక్తిదేవి యిప్పుడు "నీవుకామాదులను గెలుచుట కుద్యోగింపుము; నేనును నీపక్షమువలంబించెదను" అని సందేశము పంపినది. అక్కడఁ బ్రధానవీరుఁడైయున్న కాముని వస్తువిచారుఁ డొక్కఁడే జయింపఁదగినవాఁడు. కానిమ్ము. వానిని నిర్జించుటకయి యిప్పుడతనినే నియమించెదను. ఓవేదవతీ! నీవు వస్తువిచారుని బిలుచుకొనిరమ్ము.

ప్రతి—దేవరవా రాజ్ఞాపించినట్లు చేసెదను.

(అని నిష్క్రమించి వస్తువిచారునితోడఁగూడఁ బ్రవేశించుచున్నది.)

వస్తు—అయ్యో! నిర్విచారసౌందర్యాభిమానవర్ధిష్ణుఁడైన కామపిశాచునిచేతను ముఖ్యముగా దురాత్ముఁడైనమహామోహునిచేతను లోకము చెడిపోవుచున్నది.

చ. కలికి యటంచునున్, గలువకంటి యటంచును, సుభ్రువంచు, సుం
[illegible]లసుముఖాబ్జ యంచు, [illegible]స్తని యంచు, బృహన్నితంబ[illegible]

చెలిమి నుతింపఁ గాంచఁ బ్రథమింపఁ రమింపఁ బుఘంపు సౌర! చ
ల్వ లకుచిత్ర స్థలంబున వలంపఁగు మోహపువిచేష్టితంబులన్.

చిక్కఁగా వస్తువిచారము చేయఁగల నాత్మబుద్ధులకు సహితము మాంసాస్థిపంజరములైన స్త్రీలు స్వభావదుర్గంధనిలయ లనియు బీభత్సవేష లనియు వైరాగ్యము కలుగకున్నది. అట్లయినప్పుడు వారియం దితరగుణారోపణము చేయుట స్పష్టమే.

మ. వరముక్తామణిహారముల్ మణికణత్స్వర్ణాంగదంబుల్, సితాం
బరచిత్రోజ్జ్వల దుకూలముల్ ఘుసృణపున్నైక్షుపూతలున్ దావిపూ
సరముల్ పైపయిఁ జూచి యల్పమతు లిచ్చంగాంత్రు సమ్మోహముల్
ధరనారుల్ వరకాంక్షనామముల నుచుం దర్కింతు రజ్ఞాన్మతుల్.

(ఆకాశమునకుఁ జూచి) ఓపాపీ! చండాలా! ఓరి కామా! అనావలంబనముగా వచ్చి యీవిలాగున జనులను వ్యాకులపెట్టుచున్నావేమిరా? ఓహో! కామావిష్టుఁడు—

మ. ననుఁ గామించెను బాలయామె, యొలమిన్ నన్నిష్యంగాంకాస్యచూ
చెను, నీయుత్పలనేత్ర కౌఁగిటను జేర్చెన్ న, న్ననున్ గావి; యో
ఘనమూర్ఖా! నిను గాంచెనెవ్వతె? నినుం గామించెనెవ్వర్తె? యాం
గన మాంసాస్థుల బుంగ; లోపలి నిరాకారుండె వీక్షించెడున్.

ప్రతీహారి—ఓమహానుభావా! ఇటురమ్మి.

ఇద్దఱు—(ముందుకు నడుచుచున్నారు.)

ప్రతి—అదె మహారాజాసీనుఁడయియున్నాఁడు. నీవాయనసన్నిధికిఁబొమ్మి.

వస్తు—(దాపునకుఁబోయి) దేవా! జయమగుఁగాక! జయమగుఁగాక! వీఁడె వస్తువిచారుఁడు దేవరకుఁ బ్రణమిల్లుచున్నాఁడు.

వివే—వస్తువిచారా! ఇక్కడఁ గూర్చుండుము.

వస్తు—(కూరుచుండి) దేవా! మీ సేవకుఁడు వీఁడె వచ్చియున్నాఁడు. ఆజ్ఞ యేమో యనుగ్రహింపవలెను.

వివే—మహామోహునితో మనకు యుద్ధము సంప్రాప్తమయినది. అక్కడ ప్రధానవీరుఁడు కాముఁడు. వానికిఁ బ్రతివీరునిగా మేము నిన్ను నిరూపించినాము.

వస్తు—దేవరవారు నన్నిట్లు సంభావించుటచేత ధన్యుఁడనయినాఁడను.

వివే—ఇఁక నీ వేయాయుధముచేత గాముని జయించెదవు?

వస్తు—ఓహో! సందేహమేలా! వానికన్న వితాయిదమ్ములు. పూవిల్తునిగాముని జయించుటెంతపని? ఇక్కడఁ గూడ శస్త్రగ్రహణ మపేక్షింపవలెనా? దేవరవారు చిత్తగింపుఁడు—

బాధమదావహోక్తులను పల్కక సైతురు, విపులోదయనన్
సాధులు నిశ్చలాత్మమలసాగరతుల్య గభీరచింతయున్

(శ్లాఘనపూర్వకముగాఁ దన్నుఁ జూచుకొని)

ఉ. లేదు వచోధికక్షోభమును; లేదు శిరఃపరిపీడనంబునున్;
లేదు మనోపతాపమును; లేదు శరీరవిరుద్ధసంబునన్;
లే దలహింస యాదిగ గణింపఁగఁగల్గు ననర్థయోగమున్;
బ్రోదిగ నేని తద్దయును క్రోధజయంబున శ్లాఘ్యనయ్యెదన్

(ఇద్దఱును ముందును నడుచుచున్నారు.)

ప్రతీ—అదె మహారాజుగారు, ప్రియసఖీ! ఆయనను సందర్శింపుకొమ్ము.

క్షమ—(సందర్శించి) దేవా! జయమగుఁగాక! జయమగుఁగాక! ఇదిగో దేవర వారి దాసురాలయిన క్షమ సాష్టాంగప్రణామము చేయుచున్నది.

వివే—ఓ క్షమా! ఇక్కడఁ గూరుచుండుము.

క్షమ—(కూరుచుండి) దేవా! ఈ సేవకురాలెందునిమిత్తము పిలిపింపఁబడినదో యానతియిండు.

వివే—ఓ క్షమా! మాకిప్పుడు సంప్రాప్తమయిన యుద్ధమునందు దురాత్ముఁడయిన క్రోధుని నీవు జయింపవలెను.

క్షమ—దేవరవారి యనుగ్రహమువలన నేను మహామోహునైనను జయించుటకు సమర్థురాలనగుదును. ఇఁక నాతని యనుచరమాత్రుఁడైన క్రోధుఁ డెంత? నేనాపనిని శీఘ్రముగానే నిర్వహించెదను.

ఉ. అన్నిట దేవయజ్ఞ పితృయజ్ఞ తపోధ్యయనక్రియాదు లె
న్నెన్నొ యకారణంబ సమయించెడువానిని బాపకర్మునిన్
గన్నుల నిప్పుకల్ కురియఁ గ్రక్కెడువాని నధీరతుఁ గ్రోధునిన్
మున్నలభద్రకాళి యధముఁ మహిషాసురుఁ జంపినట్లుగన్.

వివే—ఓ క్షమా! ఇప్పుడు క్రోధవిజయోపాయము నాకు వినిపింపుము.

క్షమ—దేవా! విన్నవించెదను వినుఁడు.

చ. పురుషుఁడు క్రుద్ధుచోట నగుమోము, దురాగ్రహుచోఁ బ్రసాదముల్,
బరుషవచస్కుచోఁ గుశలవార్త, ప్రమోదము తాడనోగ్రుచో,
నొరపఁగఁ జెల్లుఁ; బొందుదు రనిర్జితచిత్తులు దైవికాపదు
ల్కూరము నై; క్రోధభావ మెటుల్ కల్గు దయారసమానసంబులన్?

వివే—సాధు! సాధు!

క్షమ—దేవా! క్రోధుని జయించుటవలననే హింసాపారుష్యమానమాత్సర్యా దులు సహితము జయింపఁబడినవారగుదురు.

వివే—మంచిది. నీవు శత్రువిజయముకొఱకు సంసిద్ధురాలవుకమ్ము.

క్షమ—దేవరవారాజ్ఞాపించినట్లు చేసెదను. (అని నిష్క్రమించుచున్నది.)

వివే—వేదవతీ! లోభుని జయించుటకయి సంతోషుని పిలుచుకొనిరమ్ము.

ప్రతీ—దేవర సెలవిచ్చినట్లు చేసెదను. (అనినిష్క్రమించి సంతోషునితోడఁ గూడఁ బ్రవేశించుచున్నది.)

సంతో—(ఆలోచించి జాలితో)

చ. ప్రతివనమందు స్వేచ్ఛముగఁ బండ్లు లభించును భూరుహంబులన్;
హితవుగ నెల్లచో దొరకు నేర్లను జల్లని స్వాదుతోయముల్;
ప్రతిలతయందుఁ జిక్కు మృదుపల్లవముల్ సుఖశయ్య కింపుగా;
నతికృపణుల్ శ్రమింపదురు కట్లయియున్ ధనికాంగణంబులన్

(ఆకాశమువంకఁ జూచి) ఓరిమూర్ఖా! లుబ్ధా! నీయీవ్యామోహము దురుచ్ఛేదమే గదా?

చ. ధనస్పృహతృష్ణికాబ్ధిజలధార వృథా వగగొన్న నీవు దా
పునఁ గన, నెన్నిసార్లు చెడిపోవఁగ లేదు ఘనత్ప్రయత్నముల్?
మనుజన్మగంబి? యాశ నిటు మాననఁటయ్యెను; నేఁడునాటిగాఁ
దునుఁగను నీమనంబశనితో శిలతో నదిచేయఁగాఁబడెన్.

లోభాంధకారహతుఁడవయిన నీయీచేష్టితము మనస్సునకాశ్చర్యము కలిగించుచున్నది. ఎట్లనిన—

మ. ధనమార్జించెదనందుఁ, బ్రాప్తమగు విత్తంబింక హెచ్చింతు నం
చును, లాభంబును వృద్ధిగోరిచెద నంచున్, సౌమ్యె ధ్యానింతు వీ
వనిశంబున్; గన నన్నిటిందినెను యాయాశాపిశాచంబు గ్ర
క్కున లోభాంధతమోవృతున్ నిను మోసంగుల్ బల్మినంచక్కటా!

మఱియు,

...ను గడించుటే మొదటఁ దద్దయుఁ గష్టము; కల్గినాపయిన్
...న్ క్షయంబును వినాశము రెండు వియోగమార్గముల్;
...ను నశింపఁ గల్గును వ్యథల్; సిరిఁ గూర్పమిఁ గల్గ వావ్యథల్;
ధనమును గూర్చుకుండుటయె దానినిగూర్చుటకో మేలు చెప్పుమా.

ఆశాదే.

విదే— మంచిది! మంగళస్నానము లాచరించి నేను బ్రాహ్మణాశీర్వాదము (పారిపార్శ్వకునితో) సంగ్రామోచితమయినరథము నాయత్తపఱిచి తీసుకొనివమ్మని సారథి కాజ్ఞాపింపుము.

పారి— దేవరవారాజ్ఞాపించినట్లు చేసెదను. (అని నిష్క్రమించుచున్నాడు.)

[అప్పుడు యుద్ధరథమును సిద్ధముచేసికొని సారథి ప్రవేశించుచున్నాఁడు.]

సార— దేవా! ఇదిగో రథము సిద్ధముగా నున్నది. దేవరవారు రథారోహణము చేయవచ్చును.

విదే— (మంగళవిధులను నిర్వర్తించి రథారోహణము నభినయించుచున్నాఁడు.)

సార— (రథవేగము నిరూపించి) దేవా! చిత్తగింపుఁడు చిత్తగింపుఁడు.

మ. పరిధూర్ధూతరజశ్ఛటానుమితిశుంభద్వ్యానధావత్ఖురా
గ్రిచయేపత్వాంచుంబితోర్వ్యపరిభాగంబుల్ మహావాహముల్
పరివలన్మంధురమధ్యమానజలధిధ్వానోగ్రఘోషంబుగా
నుపతత్ప్రోథిని వ్యోమమార్గమున నోహో! తేరుఁ గొంపోయెడున్.

ఇదిగో సమీపమునఁ ద్రిభువనపావనమైన వారణాసీనగరము దృష్టిపథమునఁబడినది.

శా. ధారాయంత్రపతజ్జలోద్గతనితాంతధ్వానసంయుక్తముల్;
నీరేజాకరప్రభాసితముల్, చెల్వొందు సౌధాగ్రముల్ ?
భూరిప్రేక్ష్యనభశ్శరద్ఘనజీమూతాంతరాజత్తటి
చ్ఛ్రీమ్యంబులవే పతాక లెసఁగున్ జిత్రధ్వజస్మేరలన్.

సతతముకుళలగ్నమధుకరనికరఝంకారముఖరంబులును వికసితకుసుమవిసరవిగళన్మకరందవర్షాతిశయమున ధురంధరంబులును నానాప్రసూనసుగంధబంధురంబులును శ్యామాయమాననిబిడచ్ఛదచ్ఛాయాపనీతపాంథసంతాపంబులును నగుపురోద్యానప్రదేశంబులవిగో సమీపంబునఁ గానవచ్చుచున్నవి. ఈవాయువులు సహిత మిక్కడఁ బాశుపతవ్రతమును గ్రహించినతాపసులవలెనే కానఁబడుచున్నవి. ఎట్లన—

చ. సురనదినీటఁ దేలి, సురజోభసితంబు కరంబుఁ దాల్చి, యీ
శ్వరునకు నర్చనల్ సలుపుచాస్పనమీఁదను బూలురాల్చి, ని
ర్భరమధుపస్వనంబునను బాటలు చాలఁ జెలంగ, వాయువుల్
హరుని నృత్యము ల్సలుపుఁ గంపమునొందులతాభుజంబులన్.

విదే— (ఆనందముతోఁ జూచి)

మ. హృదయాకర్షకమయ్యెఁ జంద్రమకుటుం డిందుంటె నీకాశి, తాఁ
బదమై ముక్తికి నిచ్చుచుట్లు, గమమార్చెన్ స్వపరిభానందమై ?

యిది భూదేవికి శ్రీలు ముత్యసరమై యుంపొందదున్ వంగి స్వ
ర్గనది, నక్రేందుకళన్ గడున్ వనుచు శ్రీనవ్యాజహాసంబునన్.

సారధి—ఓదేవా ! చూడుఁడు, చూడుఁడు. ఇది గంగాతీరమున కలంకారభూతమును త్రిభువనపావనము నైన శ్రీమత్త్రిలోకగురు విశ్వేశ్వరాఖ్యమహాదేవుని యాలయము.

వివే—(పార్శ్వములో) ఓయీ !

క. మును చెప్పితి యీదేవుం
డనఘుఁడు క్షేత్రాధినాథుఁ డని క్షేత్రజ్ఞల్ ?
తినువులిట విడిచి వింతగ
ఘనపుణ్యులు భక్తజనులు కలియుదు రితనిన్.

సార—దేవా చూడుఁడు చూడుఁడు. అదిగో మనలను గాంచినమాత్రముననే కామక్రోధలోభాదు లిక్కడనుండి దూరముగాఁ దొలంగుచున్నారు.

వివే—వారట్లే యగుదురు. కానిమ్ము నేనీయాలయమునందుఁ బ్రవేశించి యభీష్టసిద్ధికొఱకు భగవంతునికి నమస్కరించెదను. (అని రథమునుండి దిగి గుడిచొచ్చి చూడ్కి నిగిడించి) ఓమహాదేవా ! నమస్కారము నమస్కారము నన్ను దయ చూడుము.

క. కావింతు నమస్కృతులిదె
ఘనవిమలజ్ఞానదేహ ! సోమార్ధధరా !
దీనావనత్రియలోచన !
సేవకున కొసంగు నాకు శ్రేయఃప్రాప్తుల్.

(అని నమస్కరించుచున్నాఁడు)

సార—దేవా ! ఇది త్రిభువనగురుఁడైన యాదికేశవస్వామి యాలయము.

వివే—అక్కడకరుగుము (అని వెళ్ళి యాదికేశవస్వామికిఁ బ్రదక్షిణము చేసి) ఓ భగవంతుఁడా ! జయమగుఁగాక ! జయమగుఁగాక !

దండకము. అమరచయచమూచక్రచూడామణిశ్రేణినీరాజితోపాంగపాదద్వయాంభోజ ! రాజన్నఖద్యోతకిమ్మీరితస్వర్గపీఠా ! స్ఫురద్వైతవిభ్రాంతిసంతానసంతప్తవందారుసంసారనిద్రాపహారైకదక్షా ! తమోమండలోద్ధారసంభారసంఘట్టదంష్ట్రాగ్రకోటిస్ఫురచ్చైలచక్రా ! క్రమాక్రాంతలోకత్రయా ! బాహుబలప్రోద్ధృతాఖిలగోవర్ధనచ్ఛత్రనిర్వాపితాఖండలోద్యోజితాకాండచండాంబువాహాతివర్షత్రసద్గోకులత్రాణవిస్మాపితాశేషవిశ్వా ! ప్రభూతాంస ! దైతేయసీమంతినీవర్గసీమంతసిందూరసంఘాతనుమయాఖద్య

క. భీకరశోకాగ్నిశిఖా
నీకము శిథిలములొనర్చు నెఱకులనెల్లన్
జైకొలుపు దేహశోషముఁ?
బ్రాకటముగ నంతరాత్మ బవిగ దహించున్.

(ఆలోచించి) "బిడ్డా! శ్రద్ధా! నేనిక్కడనుండి హింసాప్రధానమగు నీ యుద్ధమును జూడలేను కాఁబట్టి నేనీకాశీకాపురమును విడిచి సాలగ్రామమను పేరుగల విష్ణుక్షేత్రమునందుఁ గొంతకాలము గడపెదను. నీవిక్కడనుండి వృత్తాంతమును జరిగిన ప్రకారము నాకు నివేదింపుము" అని విష్ణుభక్తిదేవి నాకాజ్ఞాపించినది కాఁబట్టి యాదేవిసన్నిధానమునకుఁ బోయి యీసమగ్రవృత్తాంతము సర్వమును నేనామెకు విన్నవించెదను (ముందునకు నడచి చూచి) ఇది యా చక్రతీర్థము. ఈ దుస్సంసారసాగరోత్తారకమయిన నావకుఁ గర్ణధారుఁడైన భగవంతుఁడగు శ్రీహరి ప్రత్యక్షముగా వాసము చేయుచున్నాఁడు (ప్రణమిల్లి) ఇదిగో మునులచే నుపాస్యమానులయిన విష్ణుభక్తిదేవి శాంతితో నేదో యాలోచించుచున్నది. నేనామెకు సమీపమునకుఁ బోయెదను (అని ముందునకు నడచుచున్నది.)

[అంతట విష్ణుభక్తియు శాంతియుఁ బ్రవేశించుచున్నారు]

శాంతి—అమ్మా! మీరు ప్రబలచింతాకులహృదయ లయి యున్నట్లు కానఁబడుచున్నారు.

విష్ణు—బిడ్డా! మహావీరతుల్యాకరమయినయీ ఘోరయుద్ధమునందు బలవంతుఁడైన మహామోహునితోఁ బ్రతిఘటించిన పుత్రప్రాయుఁడైన వివేకుని వృత్తాంత మేమయినదో తెలియక పోయెనని నామనస్సు ఉద్విగ్నమగుచున్నది.

శాంతి—దేవీ! ఇక్కడ విచారింప వలసినదని యేమున్నది? దేవిగారి యనుగ్రహమున్నందున వివేకమహారాజునకు విజయము నిశ్చయమని నేనెఱుఁగుదును.

విష్ణు—బిడ్డా.

క. ఘనధర్మపక్షబలమున
ననివార్యంబుగ లభించు నభ్యుదయంబుల్?
వినుమట్లయ్యును, సుహృదుల
మనసెపుడు నపాయశంక మఱిమఱిపూనన్.

అంతేకాక శ్రద్ధ యింతతడవు రాకుండుట మనస్సునకు సందేహము పుట్టించుచున్నది.

శ్రద్ధ—(సమీపమునకుఁబోయి) భగవతీ! ప్రణమిల్లుచున్నాను.

విష్ణు—శ్రద్ధా! నీవు క్షేమముతో వచ్చితివా?

శ్రద్ధ — దేవిగారి యనుగ్రహమువలన.

శాంతి — అమ్మా! ప్రణామము చేయుచున్నాను.

శ్రద్ధ — పుత్రీ! నన్నాలింగనము చేసికొమ్ము.

శాంతి — (తల్లిని కౌఁగిలించుకొనుచున్నది)

శ్రద్ధ — బిడ్డా! విష్ణుభక్తిదేవి ప్రసాదముచేత మునిజనమనోనివాసమునుఁ బొందుము.

విష్ణు — అక్కడ నేమిజరిగినది?

శ్రద్ధ — దేవిగారికిఁ బ్రతికూలురుగాఁ బ్రవర్తించువారికిఁ దగినట్లు జరిగినది.

విష్ణు — అది సవిస్తరముగాఁ జెప్పుము.

శ్రద్ధ — దేవీ! అవధరింపుము. దేవి యట్లాదికేశవాలయమునుండి వెడలఁగానే తనపాటలవర్ణమును గొంచెము విడిచి సూర్యుఁడు ప్రకాశించుచుండఁగా విజయఘోషాహూయమానానేక వరవీరబహుళసింహనాదబధిరితదిగంతంబును సతతోద్ధతతురగఖరతరఖురఖండితభూమండలోచ్ఛలద్విపులరజఃపటలాంతరితభాస్కరబింబంబును ప్రబలతరకర్ణతాళాస్ఫాలనోచ్చలన్మదకరికుంభసిందూరసంధ్యాయమానసకలదిశంబును ప్రళయజలధరధ్వానభీషణంబును నగు వారియొక్కయు మనయొక్కయు సైన్యసాగరము సన్నద్ధమయి యున్నప్పుడు వివేకమహారాజు మహామోహమహారాజుకడకు నైయాయికదర్శనమును దూతనుగాఁ బంపెను. అతఁడు పోయి మహామోహునితో నిట్లనియె—

మ. తను, విష్ణ్వాలయపుణ్యకాననదీపాన్నధ్యభక్తాంతరం
గనివాసంబు త్యజించి, మ్లేచ్ఛమహికిం గన్ భృత్యవర్గంబుతోఁ
జనుమన్నన్, గరవాలదారితభవత్సర్వాంగధారోత్థితన్
ఘనరక్తంబులు త్రాగఁ గూఁతలిడునక్కల్ మిర్రింగు మీమాంసకుల్

విష్ణు — తరువాత తరువాత.

శ్రద్ధ — దేవీ! తరువాతఁ గోపముచేత వికటలలాటతటతాండవితభ్రుకుటియై మహామోహుఁడు— "ఈదుర్నయపరిపాకఫలము వివేకవృత్తి ననుభవించుఁగాక!" అని పలికి, తానే మొట్టమొదటఁ బాషండాగమబృందములను పాషండశాస్త్రసహితముగా యుద్ధమునకుఁ బురికొల్పెను. ఈలోపల మనసైన్యముఖమునందు,

గీ. వేదవేదాంగతతు లుపవేదసమితి
స్మృతిపురాణేతిహాసాదు లెలమిఁ గొలువఁ,
జంద్రసమకాంతితో సరస్వతి, సరోజ
కర యగుచు నిల్చె నాకస్మికముగ వచ్చి.

విష్ణు — తదనంతరము.

శ్రద్ధ—దేవీ ! అప్పుడు వైష్ణవ శైవ సౌరాదులయిన సర్వాగమవ్యూహములును సరస్వతీదేవి సకాశమునకు వచ్చెను.

విష్ణు—అటుతరువాత.

శ్రద్ధ—తదనంతరమున—

శా. వేదమ్మీమాంస, సరస్వతీసతిపురోవీథిన్ రణోత్సాహమై,
ప్రాముఖ్యస్థితి న్యాయకాపిలమహాభాష్యాదిసద్దర్శన
స్తోమంబు లొంటుంగ ధర్మముఖిమై, శుద్ధాయుత న్యాయవో
ర్భ్యమాకారిణి నిల్చె, దుర్గకరణిన్, వేదత్రయీనేత్రియై.

శాంతి—స్వభావప్రతిపక్షము లయినయాగమవ్యూహశాస్త్రబృందము లొక్కటిగాఁ గలియుట యెట్లు సంభవించినది ?

శ్రద్ధ—పుత్రీ !

క. ఇతరేతర వైరమునన్
హతము మెలఁగు నేకవంశజాతులు తమకున్
క్షితిలోపల నవమానం
బితరులచేఁ గల్గుచోట నేకముకారే ?

వేదప్రసూతము లయినతమకు లోలోపల విరోధమున్నను, వేదసంరక్షణముకొఱకును నాస్తికపక్షబాధకేసనముకొఱకును శాస్త్రసంఘముల కైకమత్యము కలుగును. ఆగమసముదాయములో సహితము విరోధము తత్త్వవిచారములకుఁ గానరాదు. ఎట్లన—

శా. శాంతం బద్వయ మవ్యయం బజము శశ్వద్బ్రహ్మ, మాత్మస్వయం
భ్రాంతం బాగమపంక్తిచే సగుణతన్ బ్రహ్మద్యుతేశాఖ్యలన్
గంతొప్పన్ బహుధా స్తుతింపఁగఁబడున్ ? నానాగమశ్రేణి సం
క్రాంతంబౌ నొకబ్రహ్మమయమనె, సముద్రియందు నేల్లన్ బలెన్.

విష్ణు—తరువాత ? తరువాత ?

శ్రద్ధ—దేవీ ! తరువాత నిరువాఁగునందమను నిరంతరశరనికరధారాసంపాతోపదర్శితమద్దినలగుకరితురగరథపదాతులకును నుభయపక్షయోధజనులకును సంకులసమరంబు సంప్రాప్తమయ్యెను. అప్పుడు,

మ. ప్రవహించె న్నదు లస్రతోయములఁ, గ్రవ్యాస్ఫారమంకంబులన్,
వివిధోద్యద్ఘనకంకరంకనవహోభిలావకీర్ణంబులున్,
నవనారాచవిభిన్నహస్తిగిరిశీర్ణాభ్రభ్రష్టవేగోల్లస
ద్ధవళచ్ఛత్రసమూహహంసములు వైతద్యూర్ధ్వతరంగంబులన్.

శ్రద్ధ—ఉపనిషద్దేవి ప్రబోధోదయమునకై గృహీతసంకల్పురా లయి యున్నందున నతఁ డీవిధముగా శరీరముతోఁ జిరకాలముండఁడు.

విష్ణు—అగుఁగాక! వైరాగ్యోత్పత్తికొఱకు వైయాసికియైన సరస్వతిని నేనాతని కడకుఁ బంపెదను.

(అందఱును నిష్క్రమించుచున్నారు.)

ఇది ప్రవేశకము.

---

(అప్పుడు మనస్సును, సంకల్పుఁడును, ప్రవేశించుచున్నారు.)

మన—(కన్నీటితో) హా! పుత్త్రులారా! ఎక్కడకుఁబోయినారు! ఒక్కసారి మీ ప్రతిమాదర్శన మిండు. ఓశాంతిప్రముఖులారా! రాగద్వేష మద మాన మాత్సర్యములారా! నన్నుఁ గౌఁగిలించుకొండు. నాయంగములు కాలుచున్నవి. అయ్యో! అనాథుఁడను వృద్ధుఁడను నయియున్న నన్నొక్కఁడైనను నాదరింపఁడేమి? ఓయసూయాదులైన కన్యకలారా, మీ రెందుఁ బోయినారు, ఆశాహింసాతృష్ణాదులైన కోడండ్రలారా! మందభాగ్యుఁడనైన నాకొక్కరును దక్కకుండ దైవహతకుఁడు మిమ్మందఱ నేకకాలమునం దెత్తుకొనిపోయినాఁడు! (తడఁబాటుతో)

మ. తనువెల్ల న్విషవహ్నియట్లు మండున్; దాఁ గాల్చెను మర్మముల్;
పెనుపొందించెనుఁ దీవ్రవేదనలు; నాపెంపెల్ల మర్దించెనాఁ;
ఘనమోహంబెదఁ గూర్చెడున్; వరవివేకంబెల్లఁ బోఁ గార్చెడున్;
మనమున్ జీవితమున్ గ్రసించెడు, వెసన్ శోకజ్వరంబక్కటా!

(అని మూర్ఛిల్లుచున్నాఁడు)

సంక—ఓరాజా! తెప్పిఱిలుము.

మన—(తెప్పిఱిల్లి) ఇట్టియవస్థను బొందియున్న నన్ను దేవియైన ప్రవృత్తి సహిత మోదార్పకున్న దేమి?

సం—(కన్నీరు విడుచుచు) దేవా! ఇంకను నీకుఁ బ్రవృత్తి దేవి యెక్కడిది? కుటుంబమరణసంజాతశోకానలదగ్ధహృదయ యయి యామె గుండెలుపగిలి మృతి నొందినదని విన్నాఁడను.

మన—హా! ప్రియురాలా! నాకొక్క ప్రియమయిన ప్రతివచన మేలయియ్యవు? కటకటా!

ఉ. దేవిరో! నన్నుఁ బాసి మును త్రిమ్మర నెన్నఁడు స్వప్నమందునన్
నీ వెడఁబాసియుండుటను నేమృతకల్పుఁడనైతి నిత్తఱిన్;

దైవవిచేష్టితంబునను దక్కఁగఁజాలఁడితో నీవు, శోకదహా !
జీవము శోషమందెడిని ; నిసీ ! యసువుల్ కరమున్ దురంతమౌత్.

(అని మరల మూర్ఛపోవుచున్నాఁడు.)

సంక—ఓరాజా ! ఊరడిల్లుము, ఊరడిల్లుము.

మన—(తెలివితెచ్చుకొని) ఇఁక నాకు జీవితాశచాలును ఓసంకల్పా ! చితి పేర్పుము ఇప్పుడు నే నగ్నిప్రవేశముచేత శోకానలము నార్పుకొనియెదను.

(అని సన్నాహపడుచున్నాఁడు)

[అప్పుడు వ్యాససరస్వతి ప్రవేశించుచున్నది]

సర—"సఖీ ! సరస్వతీ ! అపత్యమరణఖిన్నుఁడయియున్న మనస్వియొక్క ప్రబోధముకొఱకుఁబొమ్ము. అతనికి వైరాగ్యోత్పత్తి యెట్లుకలుగునో యట్లుచేయుము" అని భగవతియైన విష్ణుభక్తిదేవి నన్నుఁబంపినది కానిమ్ము. నేనిప్పుడాతని సన్నిధికే పోయెదను. (సమీపమునకుఁబోయి) వత్సా ! ఈవిధముగా నీవతిపరితాపము నేల పొందెదవు ; పదార్థము లనిత్యములని నీకీవఱకుఁ దెలిసినదేకదా ! ఇతిహాసములును, ఉపాఖ్యానములును, నీవీవఱకుఁ జదివినవే.

చ. అరయ విరించి యింద్రులును సురాసురులున్ మునిముఖ్యులు న్మనుల్
ధరణియు వార్ధులద్రిగణములు కల్పశతాయువులైగన్,
బొరసెద ఘోరశోకకరమోహము ! నీయుబుద్బుదోపమా
స్థిరతనుసంహతుల్ తెగి నశించినయప్పుడు దుఃఖము లేమనన్ ?

కాఁబట్టి ప్రత్యక్షపదార్థములయనిత్యత్వమును భావించుకొమ్ము. నిత్యానిత్యవస్తువివేకి యగువానిని శోకమంటదు.

గీ. బ్రహ్మమొక్కటియే సత్యవస్తువగుచు
నితరమెల్ల వికల్పిత మెప్పుడగును,
యప్పు డేకత్వమును జూచు ? నట్టివాని
కెక్కడిది మోహశోకంబు లెంచిచూడ ;

మన—భగవతీ ! శోకావేగమాపితమయియున్న నామనస్సునం దిప్పుడు వివేకమునకే యవకాశము లేదు.

సర—వత్సా ! ఇది స్నేహదోషము. స్నేహము సర్వానర్థమూలకమన్న యీ యర్థము సుప్రసిద్ధమేకదా !

మ. ప్రియనామంబునఁ గ్లేశదుర్విషలతాబీజంబులన్నాఁటఁగా!
బయికిన్ స్నేహమయాంకురంబు లడరున్ వ్యగ్రాగ్నిగర్భంబులై

కూడుఁ బ్రివేశ పెట్టవలయును.

మన—భగవతీ! అశాంతవిషయమేదో ప్రసాదింపుము.

సర—వత్సా—అది రహస్యమైనది. అయినను శోకార్తుల కుపదేశించుటలో దోసములేదు,

చ. స్థిరమతి నీలనీరధరదేహుని శ్రీహరినొండెఁ, గామసం
హరుఁ బరజాశేఖండధరు సాహసునొండె దలంపు; లేనిచో,
నిరతిని గ్రీష్మవేళ వలినీటికొలంకును బోలె నాత్మ న
ప్పరము నిరస్తశోకమును బ్రహ్మముఁ జొన్పి భజింపు నిర్వృతిన్.

మన—(ఆలోచించి నిట్టూర్పుతో) సర్వవిధములచేతను నేను దేవిగారిచేత రక్షింపఁబడినాఁడను. (అని పాదములమీఁదఁబడుచున్నాఁడు.)

సర—వత్సా! నీహృదయమిప్పటి కుపదేశక్షమమయినది. కాఁబట్టి నీకుమతి యొకటికూడ నుపదేశించెదను.

మ. జనకుండో సుతుఁడో సఖుండో తనువుంజాలింప, ధీశూన్యులి
మ్మున శోకాగ్నిదశంచుకొంతయు మనమ్ము లొక్కెఁదుకొం చొక్కటన్;
కన సంసార మసారమంచు శమసౌఖ్యంబుం గనం జెంచుచున్
ఘనధీమంతుల కావిరోగపయమే కల్గించు వైరాగ్యమున్.

[అప్పుడు వైరాగ్యుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

వైరా—(ఆలోచించి)

మ. నవనీలోత్పల కోమలచ్ఛదముకన్నన్ సూక్ష్మవాత్స్యక్కు మా
నవదేహంబులపై విధాతృఁడిటు నింపె న్మాంసమున్నన్, సదా
ప్రసవదస్రాంబువిమిశ్రమాంసపిసర గ్రీవాగతధ్వాంక్షగృ
ధ్రశృకశ్వానములన్ మరల్పఁగను సాధ్యంబౌనె యెవ్వారికిన్?

మఱియును,

మ. లటిదాలోలము కల్మిజాలము ; రజోధ్యగ్నేహము ద్దేహముల్ ;
స్ఫుటసంభోగరసంబు లంతవిరసంబుల్; లోకముల్ శోకముల్ ;
ఘటితాంచద్ధనము స్మృహోనిధనముల్; వామ ల్విపత్సీమ, ల
క్కటా! యట్లయ్యుఁ! జంతు రాత్మనిరతు గ్రాక్షీణపంథన్ జనుల్.

సర—వత్సా! ఇదె వైరాగ్యుఁడు నీదగ్గఱకువచ్చుచున్నాఁడు. ఈతనిని గౌరవింపుము.

మన—నాపుత్రుఁడు వైరాగ్యుఁడా?

వైరా—(సమీపమునకుబోయి) అయ్యా! నేను నమస్కారము చేయుచున్నాను.

మన—వత్సా! పుట్టగానే నీవు నన్ను విడచిపోతివి. నన్ను గౌఁగిలించుకొమ్ము.

వైరా—(ఆలింగనము చేయుచున్నాఁడు.)

మన—పుత్రా! నిన్నుఁ జూచుటవలననే నాశోకావేశము ప్రశాంతమయినది.

వైరా—తండ్రీ! ఇకఁగూడ శోకావేశమునకవకాశమెక్కడనున్నది?

ఉ. దారనిబాంధు, లేటివరదక్ష దయకాంచను, లాకసనంబున్
వారిదముల్. సముద్రమున నావికులున్! వడిఁగూడిపాయు న
ట్లారయఁ దల్లిదండ్రులును నాత్మజాలున్ సఖులున్ సహోదరుల్
చేరుదుఁ బాయుచుండు టిది సిద్ధము; ప్రాజ్ఞులు కేడ శోకముల్?

మన—(ఆనందముతో) దేవి! సాధుయాయఁడు చెప్పినదియథార్థమే.

చ. అలనవయౌవనల్ లలన, లాయువినావలసత్కుజవ్రజం,
బలనవమల్లికాసురభిశానికందళముల్, తలంప ని
ర్మలసువివేకమార్జితతమంబగు మన్మతి కిప్పుడెండమా
వుల జలమట్లు మిథ్యలయి పొల్పతిఁ దోఁచెనుఁ దొంటివన్నియున్.

సర—వత్సా! ఇదియంతయు సత్యమేయయినను గృహస్థుఁడాశ్రమధర్మమును విడిచినుహూర్తకాలమయిన నుండఁగూడదు. కాఁబట్టి నేఁడుమొదలుకొని నివృత్తిదేవియే నీకు సహధర్మచారిణి కాఁగలదు.

మన—(లజ్జతో) దేవియాజ్ఞకు బద్ధుఁడను.

సర—శమదమసంతోషాదు లయిన పుత్రులు నీకుపచారములు చేయుదురు; యమనియమాదులు మంత్రులగుదురు; వివేకుఁడును నీయనుగ్రహమువలననే యూపనిషద్దేవితోడఁగూడ యౌరాజ్యసుఖ మనుభవించును గాక! మైత్రిమొదలగునవి తోఁబుట్టువులు నలువురును నీయనుగ్రహముకొఱకు భగవతియైన విష్ణుభక్తిదేవిచేతఁ బంపఁబడినారు. వారినిఁ బ్రసాదపూర్వకముగా నంగీకరింపుము.

మన—దేవి యాజ్ఞాపించినట్లు చేసెదను. మీయాజ్ఞలన్నిఁటిని శిరసావహించినాఁడను. (అనిహర్షముతోఁ బాదప్రణామము చేయుచున్నాఁడు,)

సర—ఈయమనియమాసనప్రాణాయామాదులును జిరంజీవివైన నీచే నాదరపూర్వకముగాఁ జూడఁదగినవారు. వీరితోఁగూడి నీవుసామ్రాజ్య మధిష్ఠింపుము. నీవు స్వాస్థ్యమును బొందినప్పుడు జీవాత్ముఁడును దనప్రకృతిని బొందును.

మ. రవిబింబంబు పయోధివీచులబలెన్, బ్రహ్మంబొకం డయ్యు సం
భవనాశాదులు పొందుతోఁచు బహుతన్ దర్పంగతిన్ హ్నసులన్

దివుటన్ వృత్తు లడంచి నీవిఁక నివృత్తిం గూడితే, నాత్మయున్
రవిబింబం బుదకప్రణంబునవలెన్, వాసైకతాచ్ఛం బగున్.

కానిమ్ము. జ్ఞాతుల కుదకప్రదానము చేయుటకొఱకు మనము నదికిఁ బోవుదము.

మన — దేవి సెలవిచ్చినట్లు చేయుదము.

[అందఱును నిష్క్రమించుచున్నారు.]



## షష్ఠాంకము.



[అప్పుడు శాంతి ప్రవేశించుచున్నది.]

శాంతి — (ప్రీతి) ! ఏకాంతముఁ దెలిసినట్లే కదా?

చ. కొడుకులు పంచతం గనఁగ ఘోషముగాఁ జని మోహుఁడేడనో
యడఁగుటచే విరక్తుఁడయి యల్లమనస్సు ప్రశాంతి నొందఁగా,
వడిగను క్లేశపంచకము పాయుటచేఁ బురుషుండు నొక్కటన్
గడుకొని తత్త్వబోధమునఁ గాంతుఁడయి సొంపెడు నెల్లయప్పుడున్.

కాఁబట్టి నీవతిత్వరితముగా నుపనిషద్దేవి ననునయించి నాసమ్ముఖమునకుఁ దీసికొనిరమ్ము. అని వివేకమహారాజుగారు నాతో సెలవిచ్చినారు. (చూచి) ఇదిగో తనలోఁదా నేదో సంతోషముతో నాలోచించుకొనుచు నాతల్లి యీవంకనే వచ్చుచున్నది.

[అంతట శ్రద్ధ ప్రవేశించుచున్నది ]

శ్రద్ధ — ఓహో ! రాజుల మారోగ్యమును బొందఁగాఁజూచి యిప్పుడుగదా చిరకాలమునకు నాకన్ను లమృతరసపూర్ణము లయినవి.

గీ. కలిగె ఖలనిగ్రహము రాజులమునందుఁ
బూజ్యులైరి శమాదిసత్పురుషులెల్ల ?
జీవులెల్లను వశ్యులై సేవచేయ,
నెసఁగుచున్నారు సర్వలోకేశ్వరుండు.

శాంతి — (చేరఁబోయి) అమ్మా! నీవునిలుచుండి యేమియాలోచించుచున్నావు?

శ్రద్ధ — బిడ్డా! రాజుల మారోగ్యమును బొందఁగా జూచి చిరకాలమునకిప్పుడుగదా నాకన్నులమృతరసపూర్ణము లయినవి.

శాంతి—అప్పుడు యోగవిఘ్నులను కొంటఁగొని మహామోహుఁడద్దృశ్యుఁడయ్యెనే, వారిప్పుడెంత మేమి ?

శ్రద్ధ—పుత్రీ ! అట్టిదురవస్థను బొందినవాఁడయ్యును మహామోహాహతకుఁడు స్వామిని మోసపుచ్చుటకయి మధుమతి యనువిద్యతోడఁగూడ యోగవిఘ్నులను బంపెను. స్వామి వారియందుఁ దగులుకొన్నయెడల, వివేకుఁ డుపనిషచ్చింతనైనను జేయుకుండునని వానియభిప్రాయము.

శాంతి—ఔరా ! తరువాత ! తరువాత ?

శ్రద్ధ—తరువాత వారుపోయి స్వామికొకయైంద్రజాలికవిద్యను జూపిరి. వారొకయత్యాశ్చర్యకరరూపమును జూపి సంభ్రమముతో నిట్లనిరి. ఓస్వామీ !

ఉ. అచిరముగా నిదిగో విను నిబ్రిపదక్షితిరయోజనదృశ్యముల్ ;
ప్రసరణము చేయుమున్విని భారతి వివృరాణగాథలన్ ;
రచనయొనర్చు శుద్ధపదరమ్యత స్వేచ్ఛను గావ్యశాస్త్రముల్ ;
ఖచరగతిం జరింపుము జగంబుల ; గోరుమణిస్థలుల్లనున్.

అతఁడు మధుమతివిద్య చేతఁ గల్పింపఁబడిన ప్రదేశమును జేరఁగా, స్థానాభిమానదేవతలాకపుట్టువల్లుగా నిట్లనిరి:—అయ్యా ! ఇందుఁగూరుచుండుము ; ఇక్కడజననమరణములు లేవు ? ఈప్రదేశము సహజసుందరమయినది? వివిధవిలాసవేషలావణ్యవతులును బుణ్యమగుణులు మంగళోత్కృష్టవ్యగ్రిపాణులును బ్రణయకృత్యచతురలును నగువిద్యాధరకాంతలు నీరె నీయొద్దనున్నారు. కాఁబట్టి యిటురమ్ము.

గీ. కనకసికతాస్థలములు కలుగునదుల,
ఘనజఘనలు వశోరులౌ కమలముఖుల,
మరకతవళిస్నేదువసాళిఁ, బొరయుము మీవు
పుణ్యసముపార్జితాఖిలభోగములను.

శాంతి—అటుపిమ్మట ?

శ్రద్ధ—పుత్రీ ! ఆమాటలువిని మాయ యిది శ్లాఘ్యమయినదని చెప్పెను; మనస్సనుమోదించెను. సంకల్పుఁడును బ్రోత్సాహపఱిచెను. స్వామి యంగీకారమార్గమును బొందినవానివలె నుండెను.

శాంతి—(ఖేదముతో) అయ్యో ! స్వామి మరలసంసారవాగురలోఁ దగులుకొనుచున్నాఁడు.

శ్రద్ధ—లేదు. లేదు.

శాంతి—యావల నేమిజరిగినది ?

శ్రద్ధ—అప్పుడు పార్శ్వవర్తియైన తర్కుఁడు వారినందఱిని క్రోధావేశకషాయితలోచనుఁడయి చూచి, స్వామినిగూర్చి యిట్లనియె:—“ఓస్వామీ! విషయామిషగ్రాసాభిలాషులును సభాప్రతారణపూర్వకులును నైన వీరిట్లు నిమ్మనుమఱల దుస్సహ విషయాగ్నిజ్వాలలయందుఁ బడఁద్రోయుచుండఁగాఁ దెలిసికోలేకున్నావేమి?

క. భవసాగరముం దాటఁగ
నవలీలం బ్రాప్తమైనయలయోగతరిన్
దవుల విడనాడి వైన నిపు
డవగాహన మేల చేసె దంగారనదిన్?

శాంతి—అటుతరువాత?

శ్రద్ధ—అప్పుడాతనిమాటవిని, ‘విషయసుఖములకు నమస్కార’మనిపలికి, పురుషుఁడు సాధుమతిని దిరస్కారము చేసెను.

శాంతి—మేలు! మేలు! నీవిప్పుడెక్కడకు బయలుదేరినావు?

శ్రద్ధ—“నేను వివేకునిఁ జూడఁగోరుచున్నాను. కాఁబట్టి నీవాతనిని శీఘ్రముగాఁ గొనిరమ్ము.” అని స్వామి నాకాజ్ఞయిచ్చెను. కాఁబట్టి నేనిప్పుడు మహారాజు సన్నిధికి బయలుదేరినాను.

శాంతి—నాకును మహారాజుగా రుపనిషద్దేవిని దీసికొనిరమ్మని యాజ్ఞయిచ్చినారు. ఔఁగాక! మనము స్వామినియోగమును నెఱవేర్తము.

(అని యిద్దఱును నిష్క్రమించుచున్నారు.)

ఇది ప్రవేశకము.

---

[అప్పుడు పురుషుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

పురు—(ఆలోచించి హర్షముతో) ఓహో! ఏమి యీవిష్ణుభక్తిదేవిమాహాత్మ్యము; ఆమెయనుగ్రహముచేత నేను—

మ. వడిఁ గ్లేశోర్ముల నాక్రమించి, మమతావర్తంబులన్ దాఁటితిన్;
గడఁకన్ మిత్రకళత్రబంధుమకరగ్రాహంబులం ద్రోలితిన్?
జడఁగా నార్చితిఁ గ్రోధబాడబశిఖిన్; దృష్ణాలతల్ ద్రెంచితిన్;
గడు సంసారసముద్రతీర మిపుడేఁ గంటిన్ సమీక్షింపఁగన్.

[అంతట నుపనిషద్దేవియు శాంతియుఁ బ్రవేశించుచున్నారు.]

ఉప—సఖీ! అట్లు నిర్దయుఁడయి యుండినభర్తయొక్కముఖమును నేనెట్లు

చూడఁగలను ? అతనిచేత నేను చిరకాలము పరదారవలె విడిచిపెట్టఁబడి యేకాకిని నయి యుంటిని.

శాంతి—దేవీ ! ఆవిధముగా నాపదలపాలయినభర్తగారి నేల నిందించెదవు ?

ఉప—సఖీ ! ఇట్లు చెప్పెదు నీ వప్పటి నాకష్టదశను జూడలేదు వినుము—

చ. అకట ! వివేకుఁ డిట్లు విధియత్నమునన్ నను దవ్వొనర్చుటన్,
సకలఖలుల్ కుబుద్ధి మెయి నన్ దమదాసిగఁ జేయ నిచ్చఁగా
శకలములై మణుల్ పడల జంకిచెడెం గరకంకణావళుల్ ;
ప్రకట శిరోమణుల్ గొనఁగ లాగుటచేఁ దెగెఁ గేశపాశముల్.

శాంతి—సఖీ ! ఇది యంతయు నామహామోహుని దుర్విలసితము. ఇందు భర్తగారి యపరాధ మేదియు లేదు. వానిచేతనే మనస్సు కామాదుల ద్వారమున మోహపెట్టఁబడుటచే వివేకుఁడు నిన్నుండి దూరము చేయఁబడినాఁడు. ఇట్లు విపన్నుఁడయిన నిజవల్లభుని సమయము ప్రతీక్షించి యుండుట కులస్త్రీలకు నైసర్గికశీలము కాఁబట్టి నీవు వచ్చి దర్శనముచేతను ప్రియాలాపముచేతను భర్తను సంభావింపుము. ఇప్పుడు శత్రులు హతము చేయఁబడినారు. నీమనోరథములు సంపూర్ణములయినవి.

ఉప—సఖీ ! నేనిప్పుడిటు వచ్చునప్పుడు నాకూఁతురైన గీతాదేవి రహస్యముగా "స్వామియైన పురుషుఁడును భర్తయు నిన్నడిగిన ప్రశ్నలకు నుత్తరములు చెప్పి నీవు వారిని సంభావింపవలయును ; తమ్మూలమునఁ బ్రబోధోత్పత్తి కాఁగలదు." అని చెప్పినది. నే నెట్లు గురుజనులముందు ప్రాగల్భ్యమును జూపఁగలను ?

శాంతి—దేవీ ! భగవతియైన గీతాదేవియొక్క యీవాక్యమునకు విచారింపఁబనిలేదు. ఈయర్థము నే భగవతియైన విష్ణుభక్తిదేవి వివేకస్వామితోఁ జెప్పినది. కాఁబట్టి పవిత్రభర్తను, ఆదిపురుషుని, నీదర్శనముచేత సన్మానింపుము.

ఉప—ప్రియసఖి చెప్పినట్లు చేసెదను. (అని ముందుకు నడుచుచున్నది.)

[అప్పుడు వివేకమహారాజును శ్రద్ధయుఁ బ్రవేశించుచున్నారు.]

వివే—ఓవత్సా! శ్రద్ధా! శాంతి నాప్రియురాలైన యుపనిషత్కాంతను జూచునా?

శ్రద్ధ—దేవా ! మీయాజ్ఞను దలఁదాల్చిపోయిన శాంతి యామె నెట్లు చూడకుండును ?

వివే—ఎక్కడఁ జూచును ?

శ్రద్ధ—దేవా ! మందరపర్వతమునందు మధుసూదనాలయములో నామె తర్కవిద్యాభయముచేత గీతాదేవి మఱుఁగు చొచ్చియున్నదని యీవార్త కేవిష్ణుభక్తిదేవి చెప్పినది.

వివే—తర్కవిద్యల కేల భయపడవలెను ?

శ్రద్ధ—దేవా! ఈసంగతి మీకామెయే వివరముగాఁ జెప్పఁగలదు. కాఁబట్టి దేవరవారు విచ్చేయుఁడు, ఇదె పురుషుఁడు మీయాగమనమునే తలఁచుకొనుచు నొంటిగా నున్నవాఁడు.

వివే—(చేరువకుఁబోయి) స్వామీ! అభివాదము చేయుచున్నాను.

పురు—వత్సా! ఈశిష్టాచారము ప్రక్రమవిరుద్ధమయినది. జ్ఞానవృద్ధుఁడవైననీచే నాకుపదేశదానముచేతఁ బితృభావము బొందితివి ఎట్లన—

గీ. మున్ను ధర్మమార్గము తప్పి భూమిసురులు
తనయులను వేఁడుకొని రల్లదారి చూప;
శిష్యులఁగ వారిజ్ఞానంబుచే గ్రహించి,
సుతులు 'సుతులార! వినుఁ'డని పితల ననిరి.

కాఁబట్టి నీవును మామీఁదఁ బితృత్వముచేత వర్తింపవలయును. ఆదియేధర్మము

శాంతి—దేవీ! ఇదె వివేకునితోడఁ బురుషుఁ డొంటిగా నున్నాఁడు. సన్నిధికిఁ బొమ్ము.

ఉప—(సమీపమునకుఁ బోవుచున్నది.)

శాంతి—స్వామీ! ఉపనిషద్దేవి యిదిగో మీపాదవందనము చేయవచ్చియున్నది.

పురు—అట్లుకాదు. అట్లుకాదు. తత్త్వావబోధోదయముచేత నీమెయే నాకు మాత. కాఁబట్టి నేనె యీమెకు నమస్కరింపవలెను. అంతేకాక

క. జననికి దేవకికిఁ గలదిర
నన్నుగ్రహముఁ జూపుటందునంతరమెంతో;
జనని భవబంధములఁ గడుఁ
బెంచును; బంధములు దేవి విడిపించుఁగదన్.

ఉప—(వివేకునిఁ జూచి నమస్కరించి దూరముగాఁ గూర్చున్నది.)

పురు—అమ్మా! నీవింతవఱకును దినము లెట్లుగడపితివో చెప్పుము.

ఉప—స్వామీ!

ఉ. పుచ్చితిఁ బెక్కునాళ్ళు ఘనమూర్ఖులతోడను నేమతంబులన్,
రచ్చల, శూన్యదేవభవనంబుల, వ్యర్థవచఃప్రసంగతిన్.

పురు—మఱి వారు నీచేతఁ దత్త్వము నేమైనఁ దెలిసికొన్నారా?

ఉప—లేదు. లేదు. వారు—

మచ్చిక ద్రావిడాంగనలమాటలకట్లు గ్రహింపకర్థముల్,
జెప్పిర నస్మదుక్తులకు స్వేచ్ఛగొనర్చి రపార్థకల్పనల్.

వారికి సావాకాంక్షార్థవిచారముకలని ప్రయోజన మంతయుఁ గేవలపరధనగ్రహణార్థమే.

పురు—తరువాత ? తరువాత ?

ఉప—తరువాత నేనొక చోట

మ. పరిపూర్ణాజ్యసహస్రాగ్నిగాఢనవనిద్ద్యోహిమ్మప్రసువాసేపిత మై,
వరసోమేష్టిపశుప్రభృత్యధ్వరముఖప్రాతోల్లసత్పాపశ్వమై,
నిరతప్రాస్యుకకర్మకాండబహుధాన్యదిష్టమార్గాళికై,
సరసం బ్రస్ఫురదుయజ్ఞవిద్యఁ బొడగాంచం గంటి మార్గంబునన్.

పురు—అటుతరువాత ?

ఉప—తరువాతఁ బుస్తకభారవాహిని యైనయామెకు నాతత్త్వమేమయినఁ దెలిసి యుండునని యెంచి నేనామెసన్నిధిని గొన్నిదినములు గడపవలెనని తలఁచితిని.

పురు—తదనంతరము ?

ఉప—తదనంతరము నేనామె సమీపమునకుఁబోఁగా, "ఓసుమంగళీ! నీకోరిక యేమి ?" అనియామె నన్నడిగెను. "అమ్మా ! నేనిప్పుడనాథనయి యున్నదానను. కాఁబట్టి నీయొద్దనుండఁగోరుచున్నాను." అని నేను జెప్పితిని.

పురు—అటుపిమ్మట ?

ఉప—అటుపిమ్మట "ఓసుమంగళీ ! నీవుచేయుపనియేమి ?" అనియామె నన్నడిగెను.

పురు—అటువెనుక ?

ఉప—అప్పుడు నేనిట్లంటిని—

చ. ఎవ్వనిలో జగంబు జనియించి రమించి లయించు, నీజగం
బెవ్వనికాంతిచే వెలుఁగు, నెవ్వనితేజము సత్సుఖోజ్జ్వలం,
బెవ్వనిఁ గల్పి ద్వైతతమమేగఁ బునర్భవ మొందరిప్పుడున్
నెవ్వడిఁ బుణ్యు, లాపురుషు నిత్యుని శాంతు స్తుతింతు నక్రియున్.

అంతట యజ్ఞవిద్య యాలోచించి యిట్లనియెను—

గీ. అక్రియుఁడగు వాఁ డీశ్వరుండగుట యెట్లు ?
సక్రియాయుతుగాని వస్తువిచారబుద్ధి
యరయ భవబంధనాశనకరము గాదు;
జనుఁడు భవనాశకరకర్మ లొనరఁ జేసి
వత్సరశతంబు శాంతుఁడై బ్రతుకఁగోరు.

పురు—అనంతరము,

ఉప—అనంతరము నేనామెను సహితము పూర్వమువలెనే యాశ్రయమును వేఁడితిని. అప్పుడామెయు "ఓసుమంగళీ! నీవు చేయుపనియేమి?" అని నన్నడిగెను. అంతట నేను దొంటివలెనే "ఎవ్వనిలో జగంబు జనియించి రమించి లయించు" మొదలు గాఁగల వాక్యమును జెప్పితిని,

పురు—ఆవల ?

ఉప—ఆవల మీమాంస పార్శ్వవర్తులము ఖమును జూచి "లోకాంతరఫలోపభోగయోగ్యుఁడైన పురుషునిఁ బ్రతిపాదించుటచేత మనకీమెవలనఁ బ్రయోజనము గలదు. కాఁబట్టి కర్మోపయుక్తయైన యీమెను స్వీకరింపుఁడు." అనిపలికెను. అక్కడ వారిలో నొకశిష్యుఁడు దాని కనుమోదించెను. ప్రసిద్ధప్రతిష్ఠుఁడైన కుమారిల స్వామియును మఱియొకఁడు మీమాంసాప్రాధిదేవతయో యనునట్లుగా "దేవీ! ఈమె కర్మోపయుక్తుఁడయిన పురుషునిఁ బ్రసాదింపదు; కర్తయు భోక్తయుఁ గానియీశ్వరునిఁ బ్రతిపాదించును. ఈమె కర్మలకెందుకేయు నుపయోగపడునది కాదు." అనెను. అప్పుడింకొకఁడు "లౌకికపురుషునికంటె నన్యుఁడయి యీశ్వరుఁడని యొకఁడున్నాఁడా?" అనియడిగెను. అంతనతఁడు నవ్వి "ఉన్నాఁడు" అని మరల నిట్లనియెను:—

చ. ఒకఁడు కనున్ జగత్త్రితయముల, నొక్కఁడు మోహమయాంధబుద్ధి యౌ;
నొకఁడిడుఁ గర్మజాలఫల, మొక్కఁడు తత్ఫలవాంఛఁ జేయుఁ; దా
నొకఁడు శరీరుఁ డున్నదుపు, నొక్కఁడు కర్మయుల న్నియంతుఁడౌ;
నిఁక ను విసంగుఁడౌ పరము నెట్లగుఁ జెప్పఁగఁ గర్మభోక్తఁగన్ ?

వివే—(హర్షముతో) మేలు! కుమారిలస్వామీ! మేలు! నీవు మంచిప్రజ్ఞఁ గలవాఁడవు. నీవు దీర్ఘాయుష్మంతుఁడవు కమ్ము.

క. సహవాసులఁ జెలులను నా
విహగంబులు రెండు నేకవృక్షమె చేరున్;
విహగమొకటి తిను ఫలముల;
నహహా! రెండవది తినక యాలోకించున్.

పురు—తరువాత ?

ఉప—తరువాత నేను మీమాంసవద్ద సెలవుగైకొని వెడలితిని.

పురు—అటుతరువాత ?

ఉప—అటుతరువాత నేను శిష్యులు పలువుండ చేత నుపాస్యమానలైన తర్కవిద్యలను బొడగాంచితిని. అందు,

మ. తెలుపన్ నిర్విశేషవిశేష మో; గౌతమి వాదింతున్ వితండావృతిన్
లలి జాతిచ్ఛలనిగ్రహాదికమహావ్యాహాళితో జల్పముల్ ;
వెలుచన్ వాక్యానన్ బూనుచు ప్రక్రియాసంక్షేదంబు లొక్కర్తు. సం
ఖ్యలచే నెన్నెదు దత్త్వముల్ మహావహంకారాదిసర్గంబులున్.

పురు—తరువాత ? తరువాత ?

ఉప—పూర్వరీతి నే నేనును వారి సమీపమునకుఁ బోయి, వారడిగినవిూఁదట "ఎవ్వనిలో జగంబు జనియించి రమించి లయించు" ఇత్యాదివాక్యములచేత మునుపటి యట్లే నాకార్యమును జెప్పితిని. అప్పుడు వారు నన్నుఁ బ్రాకృతముగాఁ బరిహసించి "ఓవాచాలులారా! విశ్వము పరమాణువులవలనఁ గలుగుచున్నది. ఈశ్వరుఁడు నిమిత్తకారణము" అనిపలికిరి. అందొకొకతె కోపముతో "ఓపిపాపాత్ముగాలా! ఈశ్వరునే సవికారునిఁజేసి వినాశధర్మము నాపాదించుచున్నావేమి?" అనెను మఱియొకతె "ఓసీ ! విశ్వోత్పత్తి ప్రకృతివలనఁ"గలిగెనని పలికెను.

వివే—ఓహో ! తర్కవిద్య లెంతదుర్మతులు ! ఘటాదికముచలెనే ప్రమేయజాతము సర్వమును గార్యమని సహిత మింతమాత్రము తెలిసికొనఁజాలకున్నారు. పరమాణువులును బ్రకృతియు నుపాదానకారణము లనుటయు నుపేక్షణీయమే.

మ. జలచంద్రుంబలె సంతరిక్షనగరస్వప్నేంద్రజాలంబు ల
ట్లలవిశ్వంబును మిథ్య, మేయమును గార్యంబౌట సాద్యంతతన్ ;
కలుగున్ శుక్తిని వెండి యట్లు శివునాఁ గం దెల్విఁదగ్గానమిన్ ;
పాలిపోవున్ బ్రకృతిఁ బన్నగభ్రమువలెన్ బోధోదయప్రాప్తిచేన్.

ఇఁక వికారశంకయు ముగ్ధపథూమానస విలసితమే. ఎట్లన—

ఉ. శాంతము నిర్మలంబును నజంబు ననంతము నిష్కలంబు నౌ
సంతతతేజ మీభువనసంభవమందు వికారమొందునే ?
కాంతిని సల్లగల్వల వనంగలహుబ్బులచాలు పుట్టుచో,
నింతయు నాకసంబు వహియించునని తాను వికారలేశమున్ ?

పురు—సాధు! సాధు ! ప్రజ్ఞావంతుఁడవయినయానీవిమర్శనము నాడెందము నానంద పెట్టుచున్నది. (ఉపనిషద్దేవినిగూర్చి) తదనంతరము ?

ఉప—తదనంతరము వారందఱును మరిడిపడి, "ఓసో ! విశ్వవిలయముచేత ముక్తి కలుగునని ప్రేలుచు, నాస్తికమార్గము నవలంబించుచున్న దీనినిబట్టి బంధింపవలెను" అని యందఱును ససంరంభముగా నన్ను నిగ్రహించుట కుద్యుక్తలైరి.

పురు—(భయముతో) ఆపయిని ?

ఉప—ఆసైని నేను మిక్కిలి త్వరితముగాఁ బఱచి దండకారణ్యములోఁ బ్రవేశించితిని. అంతట మందరగిరికి సమీపమునఁ గట్టఁబడిన మధుసూదన దేవాలయము దేవవను—

ఉ. బాహుశిరంబు లంబు భగ్నము చేసిరి గాలరత్నముల్ ;
దోర్బలముల్ శిరోమణుల దొంగిలిరి ద్రెంచిరి కేశపాశముల్ ;
దేహాళిఁ దారహారములు త్రెంచి, హరించిరి కట్టుబట్టలున్ ;

పురు—తరువాత ? తరువాత ?

ఉప—అప్పుడు దేవాలయములోనుండి వెడలివచ్చి గదాపాణులైన పురుషులు వారి నతినిర్దయముగా బాదఁగా భీతులై యందఱును దిగంతములకుఁ బాఱిపోయిరి.

వివే—(హర్షముతో) పూజ్యురాలవయిన నిన్ను తిరస్కరించువారిని విశ్వసాక్షియైన భగవంతుఁడు క్షమింపఁడుగదా ?

పురు—తరువాత ? తరువాత ?

ఉప—దేవానుభూతుల, సంధికాల తేజ్యఁగ, గీతగృహంబు చొచ్చితిన్. అక్కడ నాకూఁతురైన గీతాదేవి చేరవచ్చి నన్నుఁ జూచి, సంభ్రమముతో "అమ్మా ! అమ్మా !" అని కౌఁగిలించుకొని కూరుచుండఁ బెట్టెను. అప్పుడామె నావృత్తాంతమును విని, "అమ్మా ! నీవు మనస్సునకు ఖేదమును బొందఁబోకుము, ఏఖలులు నిన్ను పరిమాణికరాలినిగాఁ జేసి యాక్షేపముగా నాసురబద్ధులయి చరింతురో వారి నీశ్వరుఁడే శిక్షించును. ఆక్షేపించినట్టి భగవంతుఁడు గీతలయందు—

గీ. అట్టిక్రూరులఁ బాపుల నధమనరుల
ద్వేషకులుస్థులఁ గ్రోధులఁ దీవ్రగతిని
సంతతము నేను సంసారసాగరముల
లోన ద్రొక్కుట నాసురయోనులందె.

అనెను.

పురు—(సకౌతుకముగా) దేవీ ! ఆయీశ్వరుఁ డెవఁడో నీయనుగ్రహమువలన దెలిసికొనఁ గోరుచున్నాను.

ఉప—(కోపించినదానివలె) ఎవ్వఁడు తన్నుఁదాఁ దెలిసికోలేక యుండునివలెఁ బ్రత్యుత్తర మిచ్చుచున్నాఁడో యతఁడే.

పురు—(హర్షముతో) ఏమి ! నేనే యాపరమేశ్వరుఁడనా ?

ఉప—అవును.

గీ. పరుఁడవు నీకంటెఁ గాఁ డెల్లపరమపురుష ;
డన్యుఁడవు గావు నీవామహాత్మకుఁడై ;

...యుచున్నాఁడు.)

...ము ! ఆశ్చర్యము !

...లన్ దిశావళుల విద్యుల్లతల వెల్గింపుచున్,
...సూ మనసువక్షంబుఁ జీల్చి పోఁ బుట్టి, త
మోహుని ద్రుంచి, విద్యాకన్యతోడ్తోడనే
...; ప్రబోధచంద్రుఁడును దా జన్మించె జీవున్గనన్.

[ప్రబోధచంద్రుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

...మో, వ్యాప్తమో, మఱియుపోహితమో, యపసారితంబో, సం
...పితంబో, హృతమో, యనుతర్కములేక, యేని సం
జాతము చేఁ బ్రపంచము వెసం జెడునో సహజప్రకాశలీ
నాతతరూపమై, యలమహాత్ముఁడ నేను ప్రబోధచంద్రుఁడన్.

...(ముందు నడిచి) ఇతఁడే పురుషుఁడు. ఈతనికిఁ బ్రణామముఁ జేసెదను. (సమీపించి)
...! ప్రబోధచంద్రుఁడను నేను నమస్కారము చేయుచున్నాను.

పురు—(ఆహ్లాదముతో) వత్సా ! రమ్ము. నన్నుఁ గౌఁగిలించుకొమ్ము.

ప్రబో—(ఆలింగనము చేయుచున్నాఁడు.)

పురు—(ఆనందముతో) ఓహో! ఇప్పుడు వినూతతిమిరజాతమయి ప్రభాతము
...ంజాతమయినది !

చ. ఒకటఁ ప్రబోధచంద్రమహితోదయ మాటను జేసి యియ్యెడన్
ప్రకటవికల్పనిద్రయును బ్రస్ఫుటమోహతమంబుఁ బాయఁగాఁ,
జకచక నేనె శ్రద్ధ మతి శాంతి వివేక శమంబు లాదిగా
సకలజగన్మయుండయి యసంగసువిష్ణువుగా స్ఫురించెడున్.

సర్వవిధములచేతను నేను విష్ణుభక్తిదేవీప్రసాదమువలనఁ గృతకృత్యుఁడ నయినాఁడను.
అట్టి నేనిప్పుడు—

చ. విడిచి సమస్తసంగములు, వేఁడక విశ్వములోని దేనియున్,
గడలనొ మూలలందొ ఫలకాంక్షయొనర్పక సంచరించుచున్,
సుడివడి కోపమున్ భయము శోకము మోహము నుజ్జగించి, యి
ప్పుడె మునినైతి శాంతి భృశముం గని, ధ్యానియె నిల్చుతావుగన్.

[అంతట విష్ణుభక్తిదేవి ప్రవేశించుచున్నది.]

...—(హర్షముతో సమీపించి) శమితారాతివైతి...—(పురుషుని...
...గదా ...మనోరథములు...

## షష్ఠాంకము.

పురు—దేవిగారిప్రసాద మున్నప్పుడు దుష్కరమేదియుండును ? (అ
లమీఁదఁ బడుచున్నాఁడు.)

విష్ణు—(పురుషుని లేవనెత్తుచు) వత్సా! లెమ్ము. ఇంకను నేను
చేయుదును ?

పురు—ఇంతకంటె నాకుఁ బ్రియమేమున్నది ?

క. కృతకృత్యుం డయ్యెను దా
శాంతవిమతస్తోముఁ డగుచు నల్ల వివేకుం;
ద[illegible]తరజస్కుఁడనై
యతులసదానందపదవి నందితి నేనున్.

అయినను దాసీభరతవాక్యము సిద్ధించునుగాక !

చ. ఇలపయి నిష్టవృష్టిఁ గురియించును గావుత మేఘుఁ డెంతయున్ !
గలుముల రాజు లేలుదురుగాక మహిన్నిరుపద్రవంబుగన్ !
వెలితెలివిందమంబడఁచి భీమమతా విషయోగ్రపంకమై
కలఁచు భవాబ్ధి దాఁటుదురుగాక మహాత్ములు నీదుసత్కృపన్ !

సంపూర్ణము.

